## మృత్యుదాహం

వరవరరావు

కన్నీళ్ళేమయినా మిగిలి వుంటే
కాలిపోతున్న అసహాయ మానవమాత్రులకోసం దాచుకుందాం
కసి ఇప్పటికయినా మనకేమీ కలగకపోతే
కతలల్లుతున్న మొసలి కన్నీళ్ళను నమ్ముకుందాం
మనకేం తెలుసు ఇంత అమానుష సందర్భాలు వస్తాయనుకుంటే
గోబెల్స్‌ను ఇప్పుడు గానీ పోలికకు తెచ్చుకునే వాళ్ళం
వాళ్ళ పార్లమెంటును వాళ్ళే తగులబెట్టుకున్నవాళ్ళు ఎంతకు తగరని ?!
పేద పాసింజర్లకోసం హాహాకారాల ప్రకటనలు
పత్రికలకు ఒక చేత యిస్తూనే
మరొకచేత పెట్రోల్ పట్టుకొని వెళ్ళగలరు

---

ఏమీ తెలియని అమాయకకాలంలో ఇద్దరం ఒకటే అనుకున్నాం. కాని నిజానికి బతుకులోకి వచ్చేసరికి ఆలోచన వచ్చేసరికి ఇద్దరి మధ్య ఎంత అఘాతం ? ఇంతకాలానికి గాని ఒకరి మంచి మరొకరికి మంచి కాకుండా పోయింది.

మంచంలో పండుకుని నిరంజన్ - ప్రక్కన నిల్చుని నేను. ఇక ఏం మాట్లాడాలో నాకు తోచలేదు. నిజానికి ఇంక ఏం మాట్లాడగలను. ఆ గోడల మధ్య గాలి ఆడటమే కష్టమైంది. పైన వెన్నెల పందిరి కింద వికృతంగా నీడలు పాములతీరుగ అటూఇటూ కదులుతున్నయి.

మరీ దుర్భరంగా తోచగానే ఏవో రెండు మూడు పొడి పొడి ప్రశ్నలు - జవాబులు పరస్పరం విదల్చుకోగానే నేను లేచి నిలబడ్డాను.

"నిరంజన్ ఇక నేను వెళ్ళివస్తాను" అన్నాను.

"మంచిది కలుద్దాం" అతనన్నాడు.

నిజానికి ఆ మాటలు అసాధ్యం అనిపించాయి.

ఈ చోటుకు నేను మళ్ళీ రాకపోవచ్చు.

నిరంజనూ నేనూ కలుసుకోకపోవచ్చు. ఆ భావన రాగానే నా శరీరంలోంచి ఏదో భాగం తెగిపోయినటువంటి బాధతో వడివడిగా ఆ ఇంట్లోంచి బయటపడ్డాను. మా ఇంటి వైపు.

ప్రజల బ్రతుకు ప్రయాణం తలుపులు మూసి
తగలబడ్డ బోగీ మంటల్లో
మనుషుల మాంసం కబాబులు కాల్చుక తినగలరు
కిల్వెన్మణి గుడిసెలయితేనేం
చింతపల్లి గూడాలయితేనేం
ఢిల్లీ వీధులయితేనేం
మీరట్ కొలువలయితేనేం
'స్వచ్ఛంద' సతులయితేనేం
'స్వచ్ఛంద' ఆత్మాహుతులయితేనేం
ఘట్ కేసర్ ఘటనయితేనేం
హంతకుల మృత్యుదాహానికి
ఉడిగిపోతున్న మానవత్వం ఊటలు ఎన్నో

## 2

చదరంగానికైనా ఒక నీతి ఉంది
ఆటలోని పావులనే చంపుకుంటారు
ఎన్నికల రాజకీయ కుతంత్రంలో
ఎన్ని అమాయక ప్రాణాలయినా బలికావచ్చు

## 3

కాకతీయ ల్యాబ్స్* నుంచి
కాకతీయ రైలు దాకా
కదలివచ్చిన వర్తమానం
హతుల కోసం గుండెకోతనడిమి పడుతూనే
హంతకుల్ని సహస్ర కరాలతో వెతికిపడుతుంది

[* 1984 లో కాకతీయ యూనివర్సిటీ కెమిస్ట్రీ ల్యాబ్స్ తగలబడ్డాయి. పోలీసుల ప్రోద్బలంతో యూనివర్సిటీ అధికారులే ఆ పనిచేసి ఆ నేరాన్ని రాడికల్స్‌పై ఆరోపించారు.]

చారిత్రక కరపత్రం :

# జలియన్‌వాలాబాగ్‌లు, రీచ్‌స్టాగ్‌లు చవిచూస్తున్న కాకతీయ విద్యార్థులు !

## కె. యు. సి. లో కెమిస్ట్రీ ల్యాబ్ లు ఎలా కాలిపోయాయి ?

ప్రజలారా !

డిసెంబర్ 21వ రోజు ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజీలో పోలీసుల అమానుషాలు జలియన్‌వాలాబాగ్‌ను తలపింపచేస్తే 23న కె. యు. సి. లో కెమిస్ట్రీ ల్యాబ్స్ కాలిపోవడములోని మిస్టరీ రీచ్‌స్టాగ్‌ను తలపింప చేస్తున్నది.

23వ తేది వేకువజాము 3 గం॥ మొదలుకొని 6-30 గంటల వరకు కె. యు. సి. లో కెమిస్ట్రీ ల్యాబ్స్ మూడు (ఆర్గానిక్, ఇన్‌ఆర్గానిక్, ఫిజికల్ కెమిస్ట్రీ) కాలిపోతూనే ఉన్నాయి. 6-30 గం॥ ప్రాంతంలో క్వార్టర్స్‌లో పాలుపోసే వాళ్ళు ల్యాబ్‌లలో నుంచి పొగ వస్తున్నదని చెప్పేదాకా ఎవరికీ తెలియదు.

21వ తేది నుంచి యూనివర్సిటీ టీచింగ్, నాన్‌టీచింగ్ స్టాఫ్ నిరవధిక సమ్మె ప్రకటించిన తరువాత మొత్తం నాన్‌టీచింగ్ స్టాఫ్ వలెనే ల్యాబ్ అటెండర్స్ కూడా ల్యాబ్‌లకు తాళాలువేసి రిజిస్ట్రార్‌కు ఒప్పగించారు నైట్‌వాచ్‌మెన్ డ్యూటీచేసే వాళ్ళుకూడా సమ్మెలో ఉన్నారు. అంటే వైస్ ఛాన్సలర్, రిజిస్ట్రార్, యూనివర్సిటీ పోలీస్ అవుట్ పోస్టులోవున్న పోలీసులు తప్ప క్యాంపస్ లోపలవున్న వాళ్ళంతా కూడా సమ్మెలోనే వున్నారు. 21వ తేదీ నుంచి ల్యాబ్స్ ఎట్లాకాలినట్లు ?

మూడు ల్యాబ్స్ పూర్తిగా దగ్ధమయి దాదాపు 10 లక్షల రూపాయల నష్టం వాటిల్లినది. కెమిస్ట్రీ ప్రొఫెసర్, రీసెర్చ్ స్కాలర్స్, విద్యార్థులు ఎంతో ప్రేమగా చూసుకునే ల్యాబ్స్, అదే లోకంగా వాళ్ళంతా పరిశోధనలు చేసుకొనే ల్యాబ్స్ ఎట్లా కాలినట్లు ? ఒక అవకాశం షార్ట్ సర్క్యూట్ అయి వుండవచ్చు. కాకపోతే ఎవరన్నా ప్రేలే పదార్థమేదో అందులోకి విసిరి ఉండాలి. విసిరే అవకాశం ఎవరికి ఉంది ? రిజిస్ట్రార్‌గారు అప్పుడే "ఇది విద్రోహచర్య" అని తేల్చేసారు. ఎవరి విద్రోహం ?

కాలిపోతున్న ల్యాబ్స్‌లోకి క్యాంపస్‌లోనూ, దగ్గరవున్న అధ్యాపకులు, హాస్టల్స్‌లోవున్న విద్యార్థులు వెళ్ళి ఫైర్ సర్వీసెస్‌తో పాటు మంటల నార్పడానికి, వస్తువులు బైట చేర్చడానికి కృషి చేశారు. వైస్ ఛాన్సలర్, రిజిస్ట్రార్, ప్రిన్సిపాల్

స్వయంగా లెక్చరర్లు, విద్యార్థులు చేసిన సహాయాన్ని చూసారు. ఒళ్ళంతా బూడిద అంటగా కాలగా మిగిలిన వస్తువులను వీళ్ల బైటకు చేర్చారు. లెక్చరర్లు ఈ సహాయ కార్యక్రమాల్లో మునిగి ఉండగా ఒకసారి డి.యస్.పి. వచ్చిపోయాడు. ఎనిమిదిన్నరకు లాజరస్ వచ్చాడు. పోలీస్ సిబ్బందితో వచ్చాడు. "నేను విద్యార్థులను ఇంటరాగేట్ చేయాల్సివున్నది. లెక్చరర్లు, విద్యార్థులు వేరు వేరుగా నిలబడండి" అని ఆర్డర్ పాస్‌చేసాడు. విద్యార్థులను రౌండప్ చేసాడు. "వాళ్ళంతా ఇక్కడ సహాయము చేస్తున్నారు. వాళ్ళను హరాస్ చేయకండి" అని వైస్‌చాన్సలర్ అంటూనేవున్నాడు. "ఇప్పుడంతా డి. ఐ. జి. కంట్రోల్‌లో వుంది. మీరు ఏమి అనడానికి వీలులేదు" అని దురుసుగా వైస్‌చాన్సలర్‌కు చెబుతూ విద్యార్థులందరినీ వ్యాన్ ఎక్కించుకొని వెళ్ళి ఔట్ పోస్టులో పెట్టి అక్కడినుంచి హాస్టల్ మీదికి వెళ్ళి హాస్టల్‌లో వున్న విద్యార్థులందరినీ అరెస్టుచేసి వాళ్ళనూ అక్కడ పెట్టాడు. 150 మందికి పైగా విద్యార్థులను అరెస్టు చేశాడు. అందరినీ విపరీతంగా బూతులు తిడుతూ "నిన్న వైస్ చాన్సలర్‌ను ఘెరావ్ చేసింది మీరే కదురా" అంటూ చిత్రహింసలకు గురిచేశాడు. సాయంత్రం వరకు 130 మందిని వదిలేసి 20 మందిని ఔట్ పోస్టులో పెట్టి కొట్టటం ప్రారంభించాడు. వీళ్ళందరినీ దినమంతా ఎండలో నిలబెట్టి కొట్టాడు. కె. యు. సి. విద్యార్థి సంఘం అధ్యక్షుడు కా॥ సత్యనారాయణను, కార్యదర్శి కా॥ సేనం రాజును స్పృహ తప్పిపోయేదాకా కొట్టాడు. ఇంటరాగేషన్ ఎంతసేపూ "నిన్న వైస్ చాన్సలర్‌ను ఘెరావ్ చేసినది మీరేనా ?" అని, ఇంతకూ కెమిస్ట్రీ ల్యాబ్స్ ఎట్లా కాలినట్లు ? వెంటిలేటర్ నుంచి ఎవరో ఎక్స్‌ప్లోజివ్స్ విసిరివుంటారు. ల్యాబ్స్‌లో మెయిన్ స్విచ్ కూడా ఆఫ్ చేసారు. షార్ట్ సర్క్యూట్ కావడానికి వీలులేదంటాడు ప్రిన్సిపాల్. మరి రాత్రంతా క్యాంపస్‌లో గస్తీ తిరిగింది పోలీసులే. విద్యార్థుల మీదికి నెట్టడానికి పోలీసులే ఈ పని చేసారా ? డి. ఐ. జి. మొదలు లాజరస్ దాకా ఈ కుట్రలో భాగమా ? పరిణామాలు అదే ధృవపరుస్తున్నాయి. జర్మనీలో హిట్లర్ రీచ్‌స్టాగ్ (పార్లమెంట్)ను తానే కాలబెట్టించి కమ్యూనిస్టుల మీదికి ఆ నిందను తోయలేదా ! గోబెల్స్ ప్రచారము చేయలేదా ? విద్యార్థులు ఎందుకు కాలబెడుతారు ? వాళ్ళకేమొస్తుంది ?

ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజీ సంఘటన తరువాత కేవలం విప్లవాభిమానులు, సామాన్య ప్రజానీకమే కాకుండా వరంగల్ నగరంలోని మేధావి వర్గం అంతా పోలీసు

అమానుషత్వాన్ని ఖండించారు. అసహ్యించుకున్నారు. పత్రికలన్నీ పోలీసుల లాఠీ చార్జ్‌ను ఖండిస్తూ రాసాయి. ఇదివరకు ఎన్నడూ లేనంతగా ఈ సంఘటన వల్ల పోలీసుల పరపతి చులకనయింది. ఇందుకు తోడు నిరవధిక సమ్మెలో వున్న విద్యార్థుల మొదలుకొని యూనివర్సిటీ గెజిటెడ్ ఆఫీసర్లు, ప్రొఫెసర్ల వరకు అన్ని సంఘాలు ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజీ లాఠీచార్జ్‌పై న్యాయవిచారణ జరిపి నేరస్థులను శిక్షించాలని డిమాండ్ చేసాయి. విశ్వనాధ్, లాజరస్, యాదగిరిరెడ్డి (ఎస్.ఐ ల) ను సస్పెండ్ చేయాలనీ, ఆడిటోరియంనుంచి కె. యు. సి. క్యాంపస్ నుంచి అన్ని విద్యా సంస్థల నుంచి పోలీస్ క్యాంప్‌లను తొలగించాలంటున్నారు. ఈ డిమాండ్స్ పోలీస్ పరిభాషలోని నక్సలైట్లో, వారి ఫ్రంట్ సంస్థలో పెట్టినవి కూడా కావు. ముక్త కంఠముతో వరంగల్ నగరంలోని యూనివర్సిటీ, కాలేజీ అధ్యాపక, అధ్యాపకేతర, విద్యార్థి సంఘాలు కోరుతున్నాయి. కనుక ఈ సమస్యను పక్కదారి పట్టించాలి. లాఠీచార్జ్ పట్ల గాయపడిన మేధావుల, ప్రజలందరి సానుభూతికీ పాత్రులయిన విద్యార్థులను బదనాం చేయాలి. అట్లాగే బదనామ్ అయినా పోలీసుల పోయిన "పరువు" నిలబెట్టుకోవాలి. సాయం కళాశాలలో పోస్టర్లు వేసిన విద్యార్థులపై లాఠీచార్జి చేసినపుడు ఆ కళాశాలలో ప్రిన్సిపాల్‌తో సహా అధ్యాపకులంతా నిరసించినందుకు "పద్మాక్షమ్మ గుట్టలో ఆయుధాల తయారీ" కథ ఎట్లా ఇదివరలో సృష్టించారో, ఇప్పుడూ అలాగే ల్యాబ్స్ తామే తగులబెట్టి పోలీసులు విద్యార్థులపైకి నెట్ట చూస్తున్నారు. ఇకరేపటినుంచి ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజి సంఘటన గురించి కాక అందరూ ల్యాబ్స్ తగలబడడం గురించి, "విద్రోహచర్య" (Sabotage) గురించి మాట్లాడుతారు. పోలీసులమీంచి దృష్టి మళ్ళుతుంది. పోలీసుల క్యాంపస్‌పై ఇదివరకటి కన్నా ఇమ్మడి ముమ్మడి అధికారం వస్తుంది. క్యాంపస్ డి. ఐ. జి. అధీనం చేసుకున్నాడనీ సాయంత్రం వరకే వూరంతా ప్రచారమైపోయింది.

ఆడిటోరియం నుంచి, క్యాంపస్ నుంచి, విద్యాసంస్థల నుంచీ పోలీసులు పోకపోవడమే కాకుండా మరిన్ని అదనపు బలగాలు, పరిస్థితిని అదుపులోకి తేవడం అనే పేరుతో వస్తాయి. పూర్తి పోలీసు రాజ్యం ఏర్పడుతుంది. మూడు రోజులుగా ప్రజల, మేధావుల దృష్టిలో నేరస్తుడుగా బోనులో నిలబడిన లాజరస్ ఇవ్వాళ మళ్ళా వైస్‌చాన్సలర్‌ను కూడా ఖాతర్ చేయకుండా "నేరస్తులను" శిక్షించే అధికారి అయి పోయాడు.

కనుక ల్యాబ్స్ కాలడం వల్ల పోలీసులకు ఇన్ని ప్రయోజనాలు వున్నాయి. కమ్యూనిస్టులు పార్లమెంట్‌ను కాలబెట్టారంటే ప్రజలంతా నమ్ముతారని హిట్లర్ ఎట్లాగైతే భ్రమపడ్డాడో, రాడికల్స్ ల్యాబ్స్ కాలబెట్టారంటే ప్రజలు, ముఖ్యంగా యూనివర్సిటీలోని మేధావులు అట్లాగే నమ్ముతారని పోలీసులు భ్రమపడుతున్నారు. కాని క్యాంపస్‌లో వున్న ప్రొఫెసర్లు, రీడర్లు, లెక్చరర్లు, స్వయంగా సహాయ కార్యక్రమాల్లో పాల్గొన్నవాళ్ళు, రోజంతా విద్యార్థులు అవుట్ పోస్టులో అనుభవించిన హింసను చూసిన వాళ్లు పోలీసుల అమానుషత్వాన్ని మరింత అసహ్యించుకుంటున్నారు.

చరిత్ర పునరావృతమవుతున్నది - ఒకసారి విషాదంగా కొన్నిసార్లు ఫార్సుగా అంటాడు మార్క్స్. జలియన్‌వాలాబాగ్‌ను, రీచ్‌స్టాగ్‌ను పునరావృతం చేయాలనుకున్న పోలీసులు కోరలు పదనెక్కుతున్న తమ ఫాసిస్టు అహంకారంతో నాజీలు, ఫాసిస్టులు ప్రజాతంత్ర శక్తులముందు మట్టి కరుచుకుపోయిన చరిత్రకూడా పునరావృతమవుతుందని తమ ప్రస్తుత అధికార విజయ మదాంధకార అహంకారంతో గుర్తించకపోవచ్చు. ల్యాబ్స్ తగులబెట్టే కుట్ర వ్యవస్థ అధికార పీఠం కిందికి మంటలు తెచ్చే ప్రయోగాలు సమాజం అనే ల్యాబ్‌లో పురోగతిలో ఉన్నాయి. ఆ ప్రయోగాలు ఫలిస్తాయి. ఫాసిజం నశిస్తుంది.

* అన్ని కళాశాలలలో పోలీసు క్యాంపులను వెంటనే ఎత్తివేయాలి.
* ల్యాబ్స్‌కాలిన సంఘటనకు పోలీసులు, వైస్‌చాన్సలర్, ప్రిన్సిపాల్ బాధ్యులు.
* ల్యాబ్స్ కాలిన సంఘటనపై న్యాయవిచారణ జరిపించాలి.
* అరెస్టు చేయబడ్డ విద్యార్థులపై అక్రమ కేసులను ఎత్తివేయాలి.
* కార్మిక, కర్షక, విద్యార్థి, యువజన, మేధావులపై పోలీసుల దమనకాండ నశించాలి.

రాడికల్ విద్యార్థి సంఘం

1-1-1984 వరంగల్ జిల్లా

## రీచ్‌స్టాగ్ దహనకాండ

పరమ కిరాతక చర్యలకు ప్రతి రూపంగా, నియంతృత్వానికి మారుపేరుగా చరిత్రలో అతి నికృష్టమైన స్థానం సంపాదించుకున్న అడాల్ఫ్ హిట్లర్ జనవరి 31, 1933న జర్మనీ చాన్సలర్‌గా అందలం ఎక్కాడు. అసత్య, అర్ధ సత్య ప్రచారాలకు పెట్టింది పేరైన గోబెల్స్ ఆ రోజున తన డైరీలో ఇలా రాసుకున్నాడు : "కమ్యూనిస్టులపై ప్రత్యక్ష దాడులు ప్రస్తుతానికి మానుకుంటాం. విప్లవ సాధనకు బోల్షివిక్కులు మొదట ప్రయత్నం ప్రారంభించాక, తగిన అదను చూసి మేము దెబ్బతీస్తాం".

నాజీ అధికార యంత్రాంగం కమ్యూనిస్టులను ఎంత రెచ్చగొట్టినా అప్పటికి జర్మనీలో విప్లవం "ముంచుకొచ్చే" పరిస్థితులేవీ లేవు. ఎన్నికల ప్రచారం ముమ్మరంగా సాగుతోంది. ఫిబ్రవరి మొదటివారంలోనే హిట్లర్ కమ్యూనిస్టుల సభలు నిషేధించాడు ; కమ్యూనిస్టు పత్రికల గొంతు నులిమాడు. ఆఖరికి సోషల్ డెమొక్రాట్ల సభలకు కూడా అంతరాయం కలిగించాడు. అసలు చాలా సందర్భాలలో ఆ సభలకు సైతం అనుమతి ఇవ్వలేదు. అనుమతించిన సందర్భాలలో రౌడీ మూకలు వెళ్ళి ఆ సభలను భగ్నపరిచాయి.

ప్రష్యా హోంమంత్రి గోరింగ్ పోలీసు వ్యవస్థను 'ఎస్.ఎ.' 'ఎస్.ఎస్.' సభ్యులతో నింపేశాడు. (మరో మాటలో వీరే జర్మనీ ప్రజా బంధులు !) ఎవరినైనా జాలితలచి వదిలేయొద్దుగాని హిట్లర్‌ను వ్యతిరేకిస్తారని అనుమానం కలిగితే చాలు అటువంటి వ్యక్తులపై ముందు వెనుకలు ఆలోచించకుండా "ఆయుధం" ప్రయోగించమని గోరింగ్ ఆదేశించాడు. అంటే హిట్లర్‌ను వ్యతిరేకించే వారందరినీ పట్టి కరిపించమని ఉత్తర్వులు జారీ చేశాడన్నమాట. ఆ పని చేయని పోలీసులను శిక్షిస్తామని కూడా గోరింగ్ ముందే హెచ్చరించాడు.

ఫిబ్రవరి 22న గోరింగ్ సుమారు 50 వేల మంది నాజీ నరహంతకులకు పోలీసు వ్యవస్థలో స్థానం కల్పించాడు. మరి రెండు రోజులలో బెర్లిన్‌లోని కమ్యూనిస్టు హెడ్ క్వార్టర్స్ అయిన కార్ల్ లీబ్ నెక్ట్ హౌస్ పై పోలీసులు దాడి చేశారు. కమ్యూనిస్టు నాయకులు అప్పటికే అక్కడి నుండి మకాం మార్చేశారు. చాలా మంది రష్యాకో, అజ్ఞాతవాసంలోకో వెళ్ళిపోయారు. కాని పోతూపోతూ వారు వదిలేసిన కరపత్రాలు గోరింగ్ పోలీసుల కళ్ళబడ్డాయి. వాటినే పోలీసులు "డాక్యుమెంట్లు"

అని ముద్దుగా పిలిచారు. కమ్యూనిస్టులు విప్లవం ప్రారంభించబోతున్నారనడానికి ఇవే తిరుగులేని సాక్ష్యాలని ప్రభుత్వం అధికారికంగా ప్రకటించింది. ఆ ప్రచార తీరును బట్టి కమ్యూనిస్టులు ఏదో ఉపద్రవం తీసుకు వచ్చేటట్టున్నారని అందరూ నమ్మారు. మార్చి ఐదునే ఎన్నికలు. ప్రజాభిప్రాయాన్ని పూర్తిగా తమకు అనుకూలంగా మలచుకోవడానికి ఈ పది రోజులలోనే ఏదో సంచలనాత్మక సంఘటన జరిగిపోవాలి.

## రీచ్‌స్టాగ్ దగ్ధం :

అది ఫిబ్రవరి 27 వ తేదీ సాయంత్రం. జర్మనీలో తిరుగులేని నలుగురు వ్యక్తులు బెర్లిన్‌లో రెండు వేర్వేరు విందు సమావేశాలలో ఉన్నారు. దేశాధ్యక్షుడు వాన్ హిండెన్‌బర్గ్‌కు వైస్ చాన్సలర్ వాన్ పేపెన్ హేరెన్ క్లబ్‌లో ఆ రాత్రి విందు ఏర్పాటు చేశాడు. మరొక చోట — అది గోబెల్స్ ఇల్లు. అక్కడికి చాన్సలర్ హిట్లర్ సతీసమేతంగా విందుకు వచ్చాడు. ఆ సమయంలో గ్రామఫోన్ రికార్డులు వింటూ కథలు చెప్పుకుంటూ కాలక్షేపం చేస్తున్నామని గోబెల్స్ తన డైరీలో రాసుకున్నాడు. ఇంకా ఇలా రాసుకున్నాడు : "అకస్మికంగా ఆ సమయంలో డాక్టర్ హాన్ఫ్ స్టాంగ్ల్ నుంచి టెలిఫోన్ వచ్చింది. 'రీచ్‌స్టాగ్ దగ్ధమౌతోంది' అని హాన్ఫ చెప్పాడు. అది వట్టి కట్టు కథ అనుకొని నేనా మాట హిట్లర్‌కు కూడా చెప్పలేదు".

కాని హేరెన్ క్లబ్‌లో విందు ఆరగిస్తున్న ఆ ఇద్దరూ అంతకు ముందే రీచ్‌స్టాగ్ నుంచి తిరిగి వచ్చారు.

ఆనాటి సంఘటన గురించి పేపెన్ ఇలా రాసుకున్నాడు : "ఉన్నట్టుండి ఒక్కసారిగా పెద్దమంటలు లేవడం అక్కడి కిటికీల గుండా మేము చూశాం: వీధులలో ఏవో అరుపులు కూడా మాకు వినిపించాయి. ఒక బంట్రోతు రొప్పుతూ వచ్చి "రీచ్‌స్టాగ్ దగ్ధమవుతోంది" అని నాకు చెప్పాడు. ఆ మాటే నేను అధ్యక్షునికి చెప్పాను. ఆయన కూడా లేచి కిటికీ గుండా చూస్తే రీచ్‌స్టాగ్ పైకప్పు పెద్ద పెద్ద సెర్చ్‌లైట్లతో వెలిగించినట్లుగా మండడం మాకు కనిపించింది. ఉన్నట్టుండి ఆ మంటల నుంచి మాకు పెద్ద పెద్ద పేలుడు శబ్దాలు వినిపించాయి: దట్టమైన పొగలు పైకి లేస్తూ కనిపించాయి".

వైస్ చాన్సలర్ హడావుడిగా తన కారులోనే అధ్యక్షుడిని కూలేసి, భస్మీ పటల మవుతున్న ఆ భవనం వైపు కారు పోనిచ్చాడు. ఈలోగా ఇక్కడ గోబెల్స్‌కి ఆ

"కట్టు కథ" గురించి పునరాలోచన వచ్చినట్లు తానే రాసుకున్నాడు. వెంటనే కొంత మందికి టెలిఫోన్ చేసి అది కథ కాదు నిజమే అని నిర్ధారించుకున్నాడు క్షణాలలో "గంటకు అరవై మైళ్ళ వేగంతో బయలుదేరి నేరం జరిగిన ఆ స్థలం చేరు కున్నాం" అని గోబెల్స్ రాసుకున్నాడు.

అది కిరాతక చర్య అని, అందులోనూ కమ్యూనిస్టుల కిరాతక చర్య అనీ అక్కడికి చేరుకున్న వెంటనే గోబెల్స్ ప్రచారంలో పెట్టాడు. అప్పటికే గోరింగ్ చెమటలు కక్కుకుంటూ అక్కడికి చేరుకున్నాడు. "కొత్త ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఇది కమ్యూనిస్టులు చేసిన ఘోరం" అని గోరింగ్ చెప్పినట్లు పేపెన్ రాసుకున్నాడు. "కమ్యూనిస్టు విప్లవానికి ఇది తొలి చర్య. ఇక ఒక్క నిమిషం కూడా మనం ఆగ డానికి వీలులేదు. దయాదాక్షిణ్యం చూపరాదు. కమ్యూనిస్టు నాయకులు అందరినీ కాల్చి పారేయండి. ప్రతి కమ్యూనిస్టు డిప్యూటీనీ ఈ రాత్రికే అరెస్టు చేయండి" అని గోరింగ్ అక్కడికక్కడే గెస్టపో ప్రధానాధికారి రుడోల్ఫ్ డైల్స్ వైపు తిరిగి గట్టిగా అరిచాడు.

అసలు నిజంగా రీచ్‌స్టాగ్‌కు మంటలు ఎలా అంటుకున్నాయన్న విషయానికి సంబంధించిన పూర్తి నిజాలు బహుశ ఎప్పటికీ బయట పడకపోవచ్చు. ఆ నిజాలు పూర్తిగా తెలిసిన వారంతా చనిపోయారు. వారిలో ఎక్కువ మంది ఆ తర్వాత హిట్లర్‌కు బలైనవారే. రాజకీయ లబ్ధి కోసం ఈ దహనకాండకు వ్యూహం పన్నిందీ, ఆ వ్యూహాన్ని పకడ్బందీగా అమలు చేసిందీ నాజీలేనని తిరుగులేని సాక్ష్యాలున్న ప్పటికీ ఆఖరికి నురెంబెర్గ్‌లో సైతం రీచ్‌స్టాగ్ దగ్ధ కాండ వెనుకగల అదృశ్య హస్తాల గురించి పూర్తి వివరాలు బయటకు రాలేదు.

గోరింగ్ పని చేస్తున్న అధ్యక్ష భవనం నుంచి రీచ్‌స్టాగ్ భవంతి లోపలి వరకు ఒక భూగర్భ మార్గం ఉంది. ఆ భవంతి మొత్తాన్ని వేడిగా ఉంచడం కోసం చేసిన ఏర్పాట్లలో భాగంగా ఆ భూగర్భ మార్గాన్ని నిర్మించారు. ఈ సొరంగ మార్గం గుండా కార్ల్ ఎర్నెస్ట్ ఆనాటి రాత్రి కొంతమందిని వెంట బెట్టుకు వెళ్ళాడు. ఒకప్పుడు హోటల్‌లో 'బాయ్' గా పనిచేసిన ఎర్నెస్ట్ ఈ సంఘటన జరిగే నాటికి బెర్లిన్ నగరంలో ఎస్. ఎ. నాయకునిగా ఎదిగిపోయాడు. ఆ రాత్రి వాళ్ళు ఆ భవంతి అంతటా గ్యాసొలిన్, ఇంకా తేలికగా అంటుకునే మరి కొన్ని పదార్థాలూ వెద

జల్లారు. పని ముగిసిన వెంటనే వచ్చిన దారినే వెనక్కి వెళ్ళారు. అదే సమయంలో, విధ్వంసం చేయడమంటే మహా సంబరపడే ఒక డచ్ కమ్యూనిస్ట్ (పేరు మారినస్ వాన్ డెర్ లుబ్బె) తనకు పెద్దగా పరిచయం లేని ఆ బ్రహ్మాండమైన భవంతిని చేరుకున్నాడు. వాటికీ వీటికీ తన ధోరణిలో కాస్త నిప్పు పెట్టాడు. బొత్తిగా వివేచన లేని ఆ వ్యక్తి అక్కడికి రావడం నాజీలకు 'కాగల కార్యం గంధర్వులే' చేసినట్లయింది. అప్పటికే ఎస్. ఎ. మనుషులు అతనిపై ఒక కన్ను వేసి ఉంచారు. అంతకు ముందు కొద్ది రోజుల క్రితం అతడు ఒక బార్‌లో బాగా తాగి ఎన్నో ప్రభుత్వ కార్యాలయాలకు నిప్పు పెట్టానని, ఇక రీచ్‌స్టాగ్ మిగిలిపోయిందనీ గప్పాలు కొట్టడం వాళ్ళు విన్నారు.

నాజీలు ఏ పనైతే చేద్దామనుకున్నారో అదేపని చేయాలనుకుంటున్న ఒక కమ్యూనిస్టు విధ్వంసకుడు వాళ్ళ కళ్ళబడ్డాడంటే నమ్మశక్యం కాకపోవచ్చు గాని జరిగిందదే అనడానికి తగిన ఆధారాలున్నాయి.

రీచ్ స్టాగ్‌ను తగల బెట్టించాలన్న ఆలోచన పూర్తిగా గోబెల్స్, గోరింగ్‌ల పుర్రెలలో పుట్టిందే. "రీచ్‌స్టాగ్‌కు నిప్పు పెట్టించాలని ముందుగా అనుకున్నవాడు గోబెల్స్" అని నురెంబర్గ్‌లో జరిగిన విచారణలో ప్రష్యన్ ప్రభుత్వంలో అధికారిగా పనిచేసిన హాన్స్ జి. వె. వియస్ సాక్ష్యం చెప్పాడు. "నిప్పు ఎప్పుడు పెట్టాలో ఏమిటో ఖచ్చితంగా తెలిసినవాడు గోరింగ్" అని గెస్టపో చీఫ్ రుడాల్ఫ్ డయల్స్ ధ్రువీకరించాడు. రీచ్‌స్టాగ్ అంటుకున్న వెంటనే ఊళ్ళో ఎవరెవరిని అరెస్టు చేయాలో ఒక జాబితా సిద్ధం చేయమని ఆ సంఘటన జరగడానికి ముందే గోరింగ్ తనను ఆదేశించిన విషయం కూడా రుడాల్ఫ్ బయటపెట్టాడు. గోరింగే స్వయంగా ఒక సందర్భంలో రీచ్‌స్టాగ్‌కు నిప్పు పెట్టింది తానేనని సగర్వంగా చెప్పుకున్న విషయాన్ని రెండవ ప్రపంచయుద్ధంలో జర్మనీ సైన్యాధికారిగా పనిచేసిన జనరల్ ఫ్రాంజ్ హాల్డర్ చెప్పాడు. "1942లో హిట్లర్ పుట్టినరోజు సందర్భంగా జరిగిన ఒక విందులో మాటల్లో రీచ్‌స్టాగ్ ప్రస్తావన వచ్చింది. రీచ్‌స్టాగ్ ఎంత అద్భుతమైన కట్టడమో కదా అని మేము అనుకుంటుండగా మధ్యలో గోరింగ్ తలదూర్చి 'రీచ్‌స్టాగ్ వ్యవహారం తెలిసిన ఏకైక వ్యక్తిని నేనే, ఎందుకంటే దానికి మంట పెట్టిందే నేను' అని ఛాతీ విరిచాడు. అంతేకాదు తొడపై చరిచి మరీ గోరింగ్ తన ఘనకార్యం గురించి చెప్పుకున్నాడు" అని హాల్డర్ ఆనాటి సంఘటన గురించి

వివరించాడు. (అయితే రీచ్‌స్టాగ్ సంఘటనతో తనకు ఎటువంటి ప్రమేయం లేదని గోరింగ్ చివరివరకూ బుకాయిస్తూనే వచ్చాడు).

వాన్‌డెర్ లుబ్‌ను నాజీలే ఆ పనికి పురమాయించారని ఆ తర్వాత తేలింది. రీచ్‌స్టాగ్‌కు నిప్పుపెట్టమని నాజీలు అతనిని ప్రోత్సహించారు. అయితే అసలు పని అవిఘ్నంగా జరిగిపోవడానికి అప్పటికే వేరేవారిని నియమించారు. వాళ్ళు ఎస్. ఎ. మనుషులు. ఆ సంగతి వాన్‌డెర్‌కు తెలియదు. ఆ దహనకాండ అంతా తన ఘనతేనని వాన్‌డెర్ విశ్వసించేటంత పకడ్బందీగా వ్యూహం సిద్ధం చేశారు. ఆ తర్వాత లీజాగ్‌లో జరిగిన మరో విచారణలోనే అంత తక్కువ కాలంలో అంత పెద్ద భవంతిని భస్మీపటలం చేయడానికి కావలసిన సరంజామా వాన్‌డెర్ దగ్గరలేదని తేలింది. వాన్‌డెర్ ఆ భవనంలో ప్రవేశించిన రెండున్నర నిమిషాలకే. అందులోని సెంట్రల్ హాల్ భగభగ మండిపోయింది. మంట పెట్టడానికి వాన్‌డెర్ తెచ్చుకున్న సామగ్రి తన చొక్కాలో సరిపోయేటంత మాత్రమే ఉంది అది అంత పెద్ద భవంతినికగుల బెట్టడానికి సరిపోదు. రసాయన నిపుణులు ఆ మంటలకు కారణం కెమికల్స్, గ్యాసొలిన్ అని పరిశీలనల అనంతరం విచారణలో నిర్ధారించి చెప్పారు. అదికూడా భారీ ఎత్తున లోపలికి బట్వాడ చేశాక దహనకాండ జరిగిందని వారు చెప్పారు. వాన్‌డెర్ ఒక్కడూ ఆ పని ఎలాగూ చేయలేడు అలాగే ఆ భవనం మొత్తంలోనూ అనేకచోట్ల అంత తక్కువ కాలంలో మంటలు రగిలించడం వాన్‌డెర్ ఒక్కడి వల్లా అయ్యేది కాదు.

కాని సంఘటన జరిగిన ఆ క్షణం అక్కడే ఉన్న వాన్‌డెర్‌ను అదుపులోకి తీసుకున్నారు. అసలు వాన్‌డెర్‌ను ఉరి తీసి పారేద్దామనుకున్నానని గోరింగ్ ఒక దశలో కోర్టుకి చెప్పాడు. ఈ దహనకాండలో తన పేరు ఇరికించారని తెలిసి జర్మన్ కమ్యూనిస్టుల పార్లమెంటరీ పార్టీ నాయకుడు ఎర్నెస్ట్ టాలర్ స్వయంగా ఆ మర్నాడే పోలీసులకు లొంగిపోయాడు. ఆయన పేరు ఇరికించినవాడు గోరింగ్. మరికొద్ది రోజులలోనే బల్గేరియా కమ్యూనిస్టు నాయకుడు జార్జి డిమిత్రోవ్ (తర్వాత ఆయన బల్గేరియా ప్రధానమంత్రి అయ్యారు), బల్గేరియా కమ్యూనిస్టులు పొపొవ్, తానెవ్‌లను కూడా పోలీసులు అరెస్టు చేశారు. లీప్జిగ్‌లో సుప్రీంకోర్టులో జరిగిన తదుపరి విచారణలో నాజీలకు మరీ ముఖ్యంగా గోరింగ్‌కు తల ఎక్కడ పెట్టుకోవాలో తెలియని పరిస్థితి ఎదురైంది. చరిత్రాత్మకమైన ఆ విచారణలో డిమిత్రోవ్ తనకు

తానే న్యాయవాదిగా ఆ కేసు వాదించుకున్నారు. క్రాస్ ఎగ్జామినేషన్‌లో డిమిత్రోవ్ అడిగిన ప్రశ్నలకు గోరింగ్ సమాధానం చెప్పలేకపోయాడు. జరిగిందేమిటో గోరింగ్ నోచే రాబట్టడానికి డిమిత్రోవ్ వేసిన రెచ్చగొట్టే ప్రశ్నలకు గోరింగ్ ఒక దశలో బాగా రెచ్చిపోయి, "స్కౌండ్రల్ ముందు బయటకు పో" అని హుంకరించినట్లు కోర్టు రికార్డులు సూచిస్తున్నాయి.

న్యాయమూర్తి (పోలీసులతో) : ముందు అతనిని తీసుకుపోండి.

డిమిత్రోవ్ (పోలీసులు బయటకు తీసుకుపోతుంటే) : ఏం, నా ప్రశ్నలకు భయపడుతున్నావా ?

గోరింగ్ : కోర్టు బయట ఉండు, బయటకు వచ్చి, నీ పని పడతా, స్కౌండ్రల్.

జర్మన్ కమ్యూనిస్టు నాయకుడిని "కస్టడీ"లోకి తీసుకున్నా, టాలర్‌తో సహా అప్పుడు అరెస్టు అయిన నలుగురు బల్గేరియన్‌లనూ కోర్టు నిర్దోషులుగా విడుదల చేసింది. జర్మన్ కమ్యూనిస్టు నాయకుడు రెండవ ప్రపంచ యుద్ధ కాలంలోనే "కస్టడీ"లో మరణించాడు. వాన్‌డెర్ లుబ్‌ను దోషిగా నిర్ణయించి, శిరచ్ఛేదం చేశారు.

కోర్టు ఎంత నాజీల తొత్తుగా వ్యవహరించినా గోరింగ్‌కు, నాజీలకూ యోగ్యతా పత్రాలు ఇవ్వలేకపోయింది. ఆ విచారణల ఫలితంగా నాజీల ప్రవర్తనపై ఎన్ని అనుమానాలు కలిగినా దాని వల్ల అప్పటికి ప్రయోజనం ఏమీ లేకపోయింది. ఎందుకంటే జరగవలసినదంతా అప్పటికే జరిగిపోయింది. రీచ్‌స్టాగ్ దహనకాండ సంఘటనను హిట్లర్ అప్పటికే చాలా తెలివిగా, సకాలంలో, తనకు పూర్తిగా అనుకూలంగా వాడుకోగలిగాడు.

రీచ్‌స్టాగ్ భవనం భస్మీపటలం అయిన మర్నాడు అంటే ఫిబ్రవరి 28వ తేదీన హిట్లర్ దేశాధ్యక్షుడు హిండెన్‌బర్గ్‌ను కలుసుకుని పౌరహక్కులకు జర్మన్ రాజ్యాంగంలో హామీ ఇస్తున్న ఏడు సెక్షన్‌లను "జర్మన్ ప్రజల, ప్రభుత్వ పరిరక్షణ" పేర రద్దు చేయించుకున్నాడు. "దేశ భద్రతకు భంగం కలిగిస్తున్న కమ్యూనిస్టు హింసాకాండను అరికట్టే చర్య"గా హిట్లర్, ఆయన అనుయాయులూ పౌరహక్కుల రద్దుకు జారీ అయిన ఆదేశాన్ని సమర్థించుకున్నారు.

వ్యక్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను, పత్రికా స్వేచ్ఛతో సహా అన్ని రకాల స్వేచ్ఛలనూ ఆ ఆదేశం క్రింద హరించారు. వ్యక్తులు కలుసుకునే హక్కును కూడా హరించారు. పోస్టల్, టెలిగ్రాఫ్, టెలిఫోన్‌లపై నిఘా వేశారు. ఇళ్ళ సోదాకు, అవసరమైన సందర్భాలలో ఆస్తుల స్వాధీనానికి కూడా ఆ ఆదేశంలో అవకాశాలు కల్పించారు.

అంతేకాదు ఫెడరల్ రాష్ట్రాలపై రీచ్ ప్రభుత్వానికి సంపూర్ణ అధికారాలను ఆ ఆదేశం కట్టబెట్టింది. సాయుధులు ఎవరైనా సరే "శాంతికి తీవ్ర భంగం కలిగించే నేరంతో సహా అనేక రకాల నేరాలకు మారుమాట్లాడకుండా మరణశిక్ష విధించే" అధికారాలను సైతం ఆ 'డిక్రీ' రీచ్ ప్రభుత్వానికి సంప్రాప్తి చేసింది.

అలా హిట్లర్ "కమ్యూనిస్టు బూచి"ని చూపించి ఒకే ఒక్క దెబ్బతో తన ప్రత్యర్థుల నోళ్ళు కోర్టులు కూడా అడ్డుపడలేనట్లుగా మూయించగలిగాడు. తన దృష్టికి వచ్చిన ప్రతి ఒక్కడినీ విచక్షణారహితంగా అరెస్టు చేశాడు. హిట్లర్ "కమ్యూనిస్టు బూచి"ని ఎంత భయంకరంగా చిత్రించాడంటే బోల్షివిక్కులు అధికారంలోకి వచ్చేస్తారేమో, వచ్చేస్తే పరిస్థితులు ఇంకెంత దారుణంగా మారిపోతాయో అని అటు మధ్య తరగతి, ఇటు రైతాంగం భయవిహ్వాలానికి గురై హిట్లర్ నేషనల్ సోషలిజం తప్ప శరణం నాస్తి అనుకునేటట్లు చేయగలిగాడు. ఎన్నికలకు మరి వారం రోజులే గడువు.

రీచ్‌స్టాగ్‌లో పనిచేసే వారు మామూలు సందర్భాలలో అయితే అరెస్టులకు అతీతులు. కాని వారితో సహా కమ్యూనిస్టులైన అధికారులను, సోషల్ డెమొక్రాట్లనూ మొత్తం నాలుగువేల మందిని హిట్లర్ అరెస్టు చేయించాడు. ప్రభుత్వ మద్దతుతో ప్రారంభమైన దురంతాలు ఈ సంఘటనతోనే జర్మన్‌లకు మొదటిసారిగా అనుభవంలోకి వచ్చాయి. వేలాది పోలీసులు, నాజీలు ట్రక్కుల కొద్దీ నేల ఈనినట్లు వీధులలోకి వచ్చారు. ఇళ్ళలో చొరబడ్డారు. మనుషులను బలవంతంగా లాక్కువెళ్ళారు. బారక్‌లలో పడేసి చితగ్గా కొట్టారు. అమానుషంగా హింసించారు. కమ్యూనిస్టు పత్రికలను నిషేధించారు. రాజకీయ సభలను రద్దు చేశారు. నాజీలు, వాళ్ళ నేషనలిస్ట్ మిత్ర పక్షాలను తప్ప ఆఖరికి సోషల్ డెమొక్రాట్లను సైతం ప్రచార రంగంలోకే రానివ్వలేదు. నాజీల ప్రచారం మాత్రం జోరు జోరున సాగింది.

నేషనల్, ప్రష్యన్ ప్రభుత్వాల వనరులు, జర్మన్ గుత్తపెట్టుబడిదారులు గుమ్మరించిన ధన రాసులతో జర్మనీ అంతకు ముందెన్నడూ కనీవిని ఎరుగని స్థాయిలో నాజీలు ప్రచార సంరంభం పూర్తి చేశారు. ప్రభుత్వ రేడియో తొలిసారిగా హిట్లర్, గోరింగ్, గోబెల్స్‌ల వాణిని దేశం నలుమూలలకూ తీసుకుపోయింది. వీధులు స్వస్తిక్ పతాకాలతో నిండిపోయాయి; నాజీల పదఘట్టనలతో మారుమోగి పోయాయి. పెద్ద పెద్ద ర్యాలీలు, దివిటీలతో ప్రజాప్రదర్శనలూ నిర్వహించారు. లౌడ్ స్పీకర్లతో వీధులు హోరెత్తి పోయాయి. ఎటుచూసినా నాజీ పోస్టర్లే దర్శన మిచ్చాయి. కొండలపై రాత్రుళ్ళు చలి నెగళ్ళు కనిపించాయి. ఒక ఉన్మాదపూరిత ప్రచార సంరంభం అది. కమ్యూనిస్టులు విప్లవం తెస్తే ఎంతటి ఘాతుకాలు జరిగి పోతాయో పెద్ద పెట్టున ఊదరగొట్టారు. తాము అధికారంలోకి వస్తే ఈ భూతలంపై ఎంతటి సుందర నందన స్వర్గధామం నిర్మించేదీ చెవులకు తూట్లుపొడిచి మరీ విని పించారు. రీచ్‌స్టాగ్ సంఘటన జరిగిన మరునాడు ప్రష్యన్ ప్రభుత్వం ఒక సుదీర్ఘ ప్రకటన చేస్తూ తాము స్వాధీనం చేసుకున్న కమ్యూనిస్టు "డాక్యుమెంట్లు" ఎటువంటి ఘాతుకాలకు కమ్యూనిస్టులు పాల్పడబోతున్నారో వివరించింది.

"ప్రభుత్వ భవనాలు, పురాతత్వ ప్రదర్శనశాలలు, మహా మహా భవంతులు, అత్యవసర కర్మాగారాలను దగ్ధం చేయడం.... స్త్రీలను, పిల్లలనూ టెర్రరిస్టు గ్రూపు లకు అప్పజెప్పడం వంటివి ఆ డాక్యుమెంట్లలో ఉన్నాయి. రీచ్‌స్టాగ్ దహనం దేశంలో రక్తపాత తిరుగుబాటు ఆరంభానికి, అంతర్యుద్ధానికీ పచ్చజెండా కావాలి. జర్మనీ నలుమూలలా ఇవ్వాళ టెర్రరిస్టు చర్యలు ప్రారంభం కావాలి. శాంతియుత ప్రజా జీవనం అల్లకల్లోలం కావాలి. ప్రజల ఆస్తులు కొల్లగొట్టాలి. ప్రాణాలు హరించాలి. ఒక్క మాటలో దేశంలో పెద్ద ఎత్తున అంతర్యుద్ధం ప్రారంభం కావాలి" అని ఆ డాక్యుమెంట్లలో కమ్యూనిస్టులు రాసుకున్నారని ప్రచారం చేశారు.

కమ్యూనిస్టుల కుట్రను బయటపెట్టే ఈ డాక్యుమెంట్లను బయట పెడతాం అని వాగ్దానాలు చేశారు. కాని ఆ డాక్యుమెంట్లు మాత్రం ఏనాటికీ బయటకు రాలేదు. కాని ప్రష్యన్ ప్రభుత్వమే ఆ డాక్యుమెంట్లు ఉన్నాయంటుంటే వేరే ఆధారాలెందు కని చాలామంది జర్మన్లు భావించారు.

ఇక ఎటూ తేల్చుకోలేక డొగిసలాడుతున్న వారుకూడా బహుశా గోరింగ్ హెచ్చరిక వల్ల అలాగే భావించవలసి వచ్చింది. మార్చి 3వ తేదీన ఫ్రాంక్‌ఫర్ట్‌లో ఎన్నికల సభలో మాట్లాడుతూ గోరింగ్ ఇలా రంకెలు వేశాడు : "జర్మన్ ప్రజలారా, నేను తీసుకునే ఏ చర్యలనూ న్యాయవ్యవస్థ అటంకపరచలేదు.... న్యాయం గురించి ఆలోచించవలసిన అవసరం నాకులేదు. చట్టం గురించి భీతి చెందనవసరం లేదు. నా లక్ష్యం ప్రత్యర్థులను సమూలంగా నిర్మూలించడమే-మరేమీ అక్కరలేదు. ప్రభుత్వ యంత్రాంగాన్నీ, పోలీసు బలాన్నీ నేను తప్పకుండా వినియోగిస్తాను. కమ్యూనిస్టులూ, జాగ్రత్తగా అలకించండి తక్కువ అంచనాలు వేసి తప్పుడు నిర్ణయాలకు రాకండి. చివరి వరకూ పోరాడండి—నా పిడికిట పట్టి మీ గొంతులు నులిమే వరకూ పోరాడండి. నేను మా "బ్రౌన్‌షర్టు" (కిరాతక హంతక ముఠా) తో వస్తాను" అని ఆ రోజు గోరింగ్ బాహాటంగానే ప్రకటించాడు.

దాదాపుగా వినిపించకుండా పోయిన వాణి మాజీ ఛాన్సలర్ బ్రూనింగ్‌ది. ఆ రోజున ఆయన కూడా మాట్లాడాడు. రాజ్యాంగానికి స్వస్తిచెప్పే ఎటువంటి యత్నాన్నైనా తమ సెంటర్ పార్టీ ప్రతిఘటిస్తుందని, అనుమానాలు రేకెత్తిస్తున్న "రీచ్‌స్టాగ్ దగ్ధం" పై దర్యాప్తు జరిపించాలనీ ఆయన కోరాడు. "అణచివేతకు పాల్పడుతున్న వారి నుంచి అణచివేతకు గురవుతున్నవారిని రక్షించ"మని ఆ రోజున ఆయన దేశాధ్యక్షుడు హిండెన్‌బర్గును కలుసుకుని మరీ విన్నవించాడు. ఆ మొర ఆలకించేవాడే లేడు! ఆ వృద్ధ అధ్యక్షుడు బెల్లంకొట్టిన రాయిలా మారుమాట్లాడలేదు. అందరినీ గడగడలాడిస్తున్న ఆ విపత్కర పరిస్థితులలో ప్రజలే మాట్లాడవలసిన తరుణం ఆసన్నమైంది.

మార్చి 5, 1933. హిట్లర్ హయాంలో జరిగిన చిట్టచివరి ప్రజాస్వామ్య ఎన్నికలు జరిగిన రోజు అదే. ఆ రోజున ప్రజలు బ్యాలెట్‌ల సహాయంతో మాట్లాడారు. ఎంత బీభత్స దృశ్యాన్ని హిట్లర్, ఆయన అనుయాయులూ ప్రచారంలో పెట్టినా ప్రజలు హిట్లర్‌ను తిరస్కరించారు. నాజీలకు అంతకుముందు ఎన్నికలతో పోల్చితే 55 లక్షల వోట్లు అదనంగా వచ్చాయి. ఆ ఎన్నికలలో నాజీలకు పడిన వోట్లు 1,72,77,180. కాని ఇవి మొత్తం వోటర్లలో 44 శాతం మాత్రమే. అంటే హిట్లర్‌కు స్పష్టమైన మెజారిటీ రాలేదన్నమాట. అణచివేత, వేధింపులు మామూలైపోయినా కాథలిక్ బవేరియన్ పీపుల్స్‌పార్టీ సహకారంతో సెంటర్ పార్టీ బలం

అంతకు ముందు ఎన్నికలతో పోల్చితే 42,30,600 నుంచి 44,24,900 వోట్లకు పెరిగింది. సోషల్ డెమొక్రాట్లకు అంతకుముందుతో పోల్చితే 70,000 వోట్లు తగ్గాయి గాని అప్పటికే వారు 71,81,629 వోట్లతో రెండవ స్థానంలో నిల దొక్కుకోగలిగారు. ఇక కమ్యూనిస్టులు దాదాపు పది లక్షలమంది మద్దతుదారులను కోల్పోయారు. అప్పటికీ వారికి 48,48,058 వోట్లు వచ్చాయి. పేపెన్, హుంగెన్ బెర్గ్‌ల నాయకత్వంలోని నేషనలిస్టులు మొత్తం వోట్లలో ఎనిమిదిశాతం మాత్రమే సాధించగలిగారు. అంటే వారికి వచ్చిన వోట్లు 31,36,760. అంతకుముందు ఎన్నికలతో పోల్చితే ఈసారి వారి బలం పట్టుమని రెండు లక్షలు కూడా పెరగలేదు.

అయితే వోట్ల సంగతి అటుంచితే సీట్లు మాత్రం అసలు బలాబలాలను మార్చేశాయి. నాజీల 288 సీట్లకు నేషనలిస్టుల 52 సీట్లు తోడు కావడంతో హిట్లర్ ప్రభుత్వానికి మెజారిటీ వచ్చినట్లయింది. అది కూడా 16 సీట్లే అదనం. ఫరవాలేదు, ప్రభుత్వాన్ని నడిపించడానికి ఈ మాత్రం చాలు. కాని పార్లమెంటు అనుమతితో తన నియంతృత్వ పాలన సాగించడానికి హిట్లర్‌కు మూడింట రెండు వంతుల మెజారిటీ రావాలంటే ఆ మాత్రం సంఖ్యా బలం సరిపోదు.

మరి ఏం చేయాలి? అందుకే హిట్లర్ కొత్త పథకం పన్నాడు. ఆ పథకమే హిట్లర్‌కు సర్వాధికారాలూ సంక్రమింపజేసింది నాలుగేళ్ళపాటు అన్ని శాసనాధి కారాలనూ హిట్లర్‌కే అప్పగించాలని, అందుకు వీలైన చట్టంచేసి ఆదేశాలు జారీచేయ మని రీచ్‌స్టాగ్‌ను కోరడం ఆ పథకంలోని ప్రధానాంశం. ఒక్కమాటలో చెప్పా లంటే ఎన్నికైన కొత్త జర్మన్ పార్లమెంటును రాజ్యాంగ ధర్మాలన్నిటినీ హిట్లర్‌కు అప్పగించి గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోమని కోరడం. కాని దీనికి కూడా రాజ్యాంగంలో చిన్న మార్పు చేయాలి. అందుకు కూడా మూడింట రెండువంతుల మెజారిటీ కావాలి.

ఆ మెజారిటీ ఎలా సంపాదించాలన్నదే మార్చి 15, 1933న జరిగిన క్యాబి నెట్ సమావేశంలో ప్రధాన చర్చనీయాంశం. పార్లమెంటులో కమ్యూనిస్టుల బలం 81 సీట్లు వాళ్ళు సభకు "రానివ్వకుండా" చేసేస్తే సగం సమస్య పరిష్కార మైనట్లే. పోతే సోషల్ డెమొక్రాట్లకు సభలో ప్రవేశానికి అనుమతి నిరాకరిస్తే మిగి లిన సమస్య కాస్తా తేలికగా పరిష్కారమైపోతుందని గోరింగ్ హామీ ఇచ్చాడు.

నాటిక :

# ఒక వీరుడు మరణిస్తే...

పి. శశిధర్

పాత్రలు :

కొమురయ్య : 30 సం॥రాలు. బక్కపలుచగా ఉంటాడు. కోపగొండి హరిజనుడు.
పోశెట్టి : 40 సం॥రాలు. హాస్యం మాట్లాడుతూ ఉంటాడు. పొట్టిగా ఉంటాడు.
రాజమ్మొదు : గడ్డం. 45 సం॥రాల నెమ్మదస్తుడు.
చంద్రయ్య : మిలిటెంటు. 30 సం॥రాలు. కొద్దిగా చదువుకొన్నవాడు.
భాస్కర్ : కార్యకర్త 30 సం॥రాలు, నెమ్మదస్తుడు. కళ్ళపుగోలు మనిషి.
భూమయ్య : సూపర్‌వైజర్ (సర్దార్) 50 సం॥రాలు.
సిపిఐ లీడరు : షావుకారులాగానే ఉంటాడు. బొట్టుండదు. 55 సంవత్సరాలు.
వైకుంఠం : షావుకారు 45 సం॥రాలు. లాల్చి వేసుకొని బొట్టు పెడతాడు.

ఒక సర్కిల్, ఇద్దరు పోలీసులు సివిల్ డ్రెస్సులు.

(వైకుంఠం, సర్కిల్, సి.పి.ఐ. లీడరు మనుషులు లేకుంటే ఒక్కరే కొద్ది మార్పులతో వేయించవచ్చును.)

లక్ష్మి : 25 సం॥రాలు.

రంగస్థలం : ఒకటి కొమురయ్య ఇల్లు. ఒక కుండ, ఒక ఫొటో, డ్యూటీ బట్టలు, టోపీ, ద్వారం పెట్టి ఇల్లులాగా చేయవచ్చును.

రెండోది గని దగ్గర ఈ సామాన్లు తీసేస్తే అదే గనిదగ్గర స్థలము.... వీలైతే చిందరవందరంగా ఆయిదారు బొగ్గుపెళ్ళలు పెట్టవచ్చును.

---

హిట్లర్ కూడా అదే శ్రేష్టమైన మార్గమని మనసులో అనుకున్నాడు. రీచ్‌స్టాగ్ సంఘటన జరిగిన వెంటనే దేశాధ్యక్షుడు జారీ చేసిన ఆదేశం ఎలాగూ ఉంది. దాని సహాయంతో తనకు మూడింట రెండువంతుల మెజారిటీ రావడానికి ఎంతమంది ప్రతిపక్ష డిప్యూటీలను అరెస్టు చేయాలో అంతమందినీ హిట్లర్ ఆ రోజే అరెస్టు చేశాడు.

(విలియం ఎల్ షిరర్ రాసిన 'డి రైజ్ అండ్ ఫాల్ ఆఫ్ ద థర్డ్ రీచ్' ఆధారంగా)

**నటులకు సూచన :**

నాటికలో కథ మాత్రమే చెప్పబడినవి. కథననుసరించి మాటలు ఎన్నైనా పెట్టుకోవచ్చును. ఒకరకంగా వీదలపాట్లు నాటకం లాగా దీన్ని స్క్రిప్టు లేకుండానే ప్రదర్శించవచ్చును. గనుల ప్రాంతం కొత్త గనుక రాయడం జరిగింది.

పాటలు సందర్భానుసారంగా సింగరేణిమీద వచ్చిన పాటలు పాడుకోవచ్చును........

మార్పులు చేర్పులు జననాట్యమండలి కళాకారులే చేసుకోవచ్చును.

**కథలోని అంశాలు :**

1) గని పని పరిస్థితులు, ఆర్థిక పోరాటాలు, ప్రమాదాలు
2) వేజ్ బోర్డు సమ్మె
3) సికాస నాయకత్వం
4) ఒక వీరుడు మరణిస్తే పోరాటం ఆగిపోదు.

## ఒకటవ రంగం

(స్టేజిమీద చీకటి)

**ఒకకంఠం** : రాజమ్మదు నడుత్తన్నవా ?
**రెండవకంఠం** : ఈడ్పుగాళ్ళ కొమురయ్యేడి ?
**మూడవకంఠం** : అత్తన్నపా మొగడా !

ఇంతలో సైరన్ కూత కూస్తుంది. మాటలు ఆగిపోతాయి.
సింగరేణి సీటి విని
సద్ది కూడు సగండిని
బాయి పనికి నువ్వేపోతివా ! ఓ మజ్దూరన్నా
బొందకిందికి నువ్వే పోతివా ! ఓ మజ్దూరన్నా

పాట సాగుతూ వుండగానే స్టేజిమీదికి ఒక్కొక్కరే నలుగురు కార్మికులు వస్తారు. వాళ్ళ తలలకు కట్టుకున్న లైటు వెలుతురులో కార్మికులు గనిలోనికి దిగుతూ వుంటారు. కాళ్ళు జారుతూ ఉంటాయి. పై కప్పుకు టోపీలు తాకుతూ వుంటాయి. చీకట్లో పునుకుతూ పునుకుతూ గుడ్డిలైట్ల వెలుగులో నడుస్తుంటారు. కొమురయ్య జారి పడబోతాడు. రాజమ్మదు పట్టుకుంటాడు.

కొమురయ్య : బాయిదొరలు బద్మాషులు, ఓవారన్నా సరిగలేదు. గీలైట్లన్న మంచియి లేవు. నలుక తుత్తురు లైట్లు - గీ లైట్లేసి మొఖం పలగ్గొట్టాలె....

రాజమ్మదు : పెండ్లి కచ్చినవా బిడ్డా !

పోశెట్టి : పెండ్లయితేనే అచ్చిండు. అటునాత్రి పనాయె, ఇటు బాయి పనాయె డబల్ డూటీలల్ల తెర్లయి పోయిండు.

చంద్రయ్య : ఎట్ల అట్టకట్టునోన్నివి అట్టి బొక్కయి పోతివేమే ?

రాజమ్మదు : పొల్లగానికి బాయిపని పడుతలేదు.

కొమురయ్య : గీరాచ్చసి పని ఎవలకు పడుతది. మావూల్లె దొరలతోని పడక - గుంటెడు జాగలేకనే గీడికత్తి - నా వొంట్లె నెత్తురు మాంసం బాయి మింగిందే—

(మరికొంతదూరం నడిచి వర్కింగ్ ప్లేసును చేరుకుంటారు) పోశెట్టి బాయిల డిగినంక పెద్దల దలిత్తె ఆయితాడి పరాత్పర మైసవ్వతల్లి....

(పనికి సిద్ధమౌతుంటారు.)

ఒక కంఠం : ఫిఫ్టీలెవల్ సౌత్‌మే బత్తీలగానా ? కోయి హైనా ? బాజూ హటావో.... ఖబర్దార్.

ఇంకో కంఠం : ఏస్తావా !

" ఎయ్యి....

ఏస్తావా ?

ఎయ్యి....

(డామ్మని లోపలనుండి బొగ్గును పేల్చిన శబ్దం వినిపిస్తుంది. నలుగురు కార్మికులు నెత్తులకు చుట్టబట్టలు చుట్టుకుంటారు.)

రాజమ్మదు : అరె కొమురయ్య జెర కూరాకు మంచిడినాలె.

పోశెట్టి : ఆఁ ఇద్దరాలు మొగలకు ఒకటే మెతుకు. లెక్కలుగట్టి మనసేతుల బెట్టెటాల్లకు గద్దలు తన్నుక పోయినట్టు ఏడియాడ పోనేపోయె.

రాజమ్మదు : నాలుగో ఏజిబోర్డత్తదంట లీడర్లు సెవులు గోసిన కుక్కలోలె మొత్తుకుంటండ్లు గద.

చంద్రయ్య : ఆఁ లీడర్లు ఢిల్లిలకొట్లాడ్తరు. మనం బాయిల సత్తం. నా కెరుకలే కడుగుత లీడర్లు ఏదన్న కొట్లాడి తెచ్చిరానే ?

కొమురయ్య : వాళ్ళకేంతీట - ఒక్కొక్కడు పసకమీద గొర్రెపోతులు బలిసినట్టు బలిసిండు - పిల్ల పిల్ల తరాలు సంపాయించుకున్నరు.

పోశెట్టి : అల్లిరాణి భాగోతంల బుడ్డరకొం తప్పిచ్చినట్టు సర్దారు గాడింక రాకపాయె

రాజమ్మదు : ఆడు ముచ్చటకు మూతులు సాపుతడు. ఏడ కూసున్నడో ?

కొమురయ్య : అడ్డగడుపు మేనేంజరు గాడేడవాయె.

పోశెట్టి : ఆఁ వాడీడకత్తె ఊదు గాలది. గాలి పంఖకింద కూసుండి ఆట్టు బూట్టంటడు.

చంద్రయ్య : గీపేసిల గర్మికగ్గిదల్గ దిగసెములలు కొరవట్టె.

(ఇంతలోనే భూమయ్య సర్దార్ ఇన్స్పెక్షన్ చెయ్యటంకోసం రూఫ్ను కర్రతో పొడుస్తూ వస్తాడు.)

భూమయ్య : ఏమాయెరో - సాపుక తీరిపారి ముచ్చెట్లు పెట్టబడితిరి.

కొమురయ్య : నువ్వె గిప్పుడు రావట్టివి. మల్ల రెండు టబ్బులు నింపాలని సీల్గితివి.

భూమయ్య : ఏందిరో లావు దిమాకిమీద మాట్లాడ్తన్నవ్ ?

కొమురయ్య : నెత్తిల నుంచి జెలకారంగ బొగ్గెత్తుడంటె కట్టె పొడుసుడను కున్నవ.

పోశెట్టి : జా మొఖద్దమ్ ఆడోలు కడుపోనికి గీపేసిల గరంగున్నదని చెప్పవా?

భూమయ్య : కనేదానికి లేని తినుకుడు మంత్రసాని కేందోట - గీపేసి మీకెరుక లేందా? దిగకముందే మేనేంజరుతోని మాట్లాడుకోవాలె-

పోశెట్టి : నీకుమల్లో పమోషనొచ్చి ఓర్మేన్ గాను. అన్నీ మేమే అడిగినంక నువ్వెందుకు మొఖద్దమ్?

చంద్రయ్య : మొఖద్దమ్- రూపెందుకో బొకబొక లాడుతుంది జెర మంచిగ సూడు.

భూమయ్య : బొకబొక లేదు పకపక లేదు నడువుండ్లి-నడువుండ్లి.

(భూమయ్య అక్కడుంటే ఇంకా తిట్లు తప్పవని ఎట్ల వచ్చినవాడు అట్లాగే వెళ్ళిపోయాడు)

ముగ్గురు కార్మికులు లేచాట - పాట మళ్ళీ విన్పిస్తుంటది - పొరలు బొకబొక లాడుతాయి....

రాజమ్మదు : పదిలం కొమురయ్యా- పదిలం....

చంద్రయ్య : అరరే.... (పరుగెత్తుకొస్తాడు. అప్పటికే పెళ్ళకూలి కొమురయ్య తట్టవేసుకొని కిందపడుతాడు. రక్తం.... కొమురయ్య మొత్తుకొం

టాడు. పోశెట్టి భూమయ్య కోసం పరుగెత్తుతాడు. కొమురయ్య కాలు నుండి నెత్తురు కారుతూ వుంటుంది.)

రాజమ్మదు : పొడి పొడి పానాలు దింటరు.... పొదశనో పొదశనంటరు. బాయిల సౌలత్ పట్టించుకోరు. ఈ బాయి పనికి అగ్గి దగ్గ ఎందరి పానాలు దింటదో....

(పాట మెల్లగా విషాదంగా - 'బండ కిందికి నువ్వే పోతివా ఓలాడీసన్నా' విన్పిస్తుంటది.)

రెండవ రంగం

(ద్వారం మాత్రమే కన్పిస్తుంది. స్టేజి మీద వెలుతురు)

కొమురయ్య : (కాలుకు పెద్ద కట్టుకట్టి ఉంటుంది) లచ్చీ! ఏడ సచ్చినవే? (గావుకేక పెడుతాడు)

లక్ష్మి : అత్తన్న.... ఇగ ఇద్దరికి ఏం పనున్నది. నీ ముడ్డి మూడు సుట్లు తిర్గుడేనాయె (చెంబుతో నీళ్ళు తెస్తుంది)

లక్ష్మి : మొఖమన్న కడుక్కోరాదు. (అక్కడ పెట్టి పోతుంది) కొమురయ్య లేచి నిలబడడానికి ప్రయత్నం చేస్తాడు.

లక్ష్మి : బతుకింట్ల పీనిగెల్ల ఏడికిబోయిన ఏడే మానుకలు. అద్దయ్య కలో గంజో తాగి ఉన్న ఊళ్ళనే కాలవడుదామంటే ఇంటెనా ? బుక్కు పిట్ల తీర్గ అడ అగకపాయె. సంగమో సంగమంట సచ్చె ఈడ.... (గొంతులో గురగుర)
(కొమురయ్యకు సాయంపట్టి మొఖం కడు[illegible]తుంది)

లక్ష్మి : పొయ్యిల నుంచి పెనం మీద పడ్డట్టయ్యింది బతుకు.

కొమురయ్య : నీ యవ్వ.... (మీది కురుకుతాడు)

లక్ష్మి : అడిదాన్ని కొట్టంది ఇది మీసం కొదన్నడట.

కొమురయ్య : నీ యవ్వ తంత (వెంట్రుకలు పట్టుకుంటాడు)

లక్ష్మి : రేషం లావు-సాలు.... గతిట్లు మాటలేందో. అన్నచ్చినంక అడుగుత- ఈ నెల సిట్టీలేం కడుతవు. రేషనుకేమి త్తవు. షావుకారి బండు బండు తిట్టిపోతండు. మానం లేదు సెత్తకు.

కొమురయ్య : నన్నేం చెయ్యమంటవే?

లక్ష్మి : నువ్వేం చేత్తవు ? ఉన్నన్ని మీ నాయిన్నకు మీ అవ్వకు నాకు ఇంత ఇషమియ్యి.

(కొమురయ్యను కూడ చ్ఛండ పెడుతుంది)

లక్ష్మి : బాయిపని కగ్గి తల్ల అవి బలిగోరినట్టేనాయె. బుచ్చానికి పోయిన దాసరోన్ని కుక్క కరిసిందంట. పానం మంచిగున్నప్పుడు మూల మూల లీగి డూటీలు చెయ్యక పోతివి.

(ఇంట్లోకి వెళ్ళి చాయ్ తెస్తుంది)

కొమురయ్య : (చాయ్ కప్పు విసిరికొడుతాడు)

లక్ష్మి : (ఏడుపు గొంతుతో) మా అయ్య ఇంట్ల పీనిగెల్ల పుట్టినప్పుడే బొండిగ పిసుకకపాయె.

(ఇంతలోనే 'ఓరి కొమురయ్య' అంటూ పిలుస్తూ షావుకారు వైకుంఠం ప్రవేశిస్తాడు)

వైకుంఠం : ఎన్ని సార్లచ్చినా కొమిరిగాని కొంప దొరికి సావదుగదా! (ఓసేపు అటిటు చూసి) గీ సందేనా? సందుల మన్నుగాను. అన్ని ఒక్క తీర్గనే కాలపడె. దొంగకు తొవ్వదొరకని సందులు. ముండ కొడుకులు తినుపన్నా దూరం పారవోసుకోరు. మళ్ళ పందులు చూ.... ఓరి కొమిరిగా....

కొమురయ్య : ఆ.... ఏందది ?

వైకుంఠం : హమ్మయ్య. దొరికినావుర. (తేరిపారజూసి) అయిందార పనివరుస. అసలే నొక్కపాసామివంటే అండ్ల దెబ్బ తాకిచ్చుకున్నవా ? అరె బయి నువ్వు గంగల దునుకు. నా ఖాతా నాకు గట్టకుంటే-ఎరికేనా?

కొమురయ్య : ఏం జేత్తవ్ ? (కోపంగా)

వైకుంఠం : ఏం జేత్తనా ? తాతకు దగ్గులు నేర్పకు - ఇంట్ల ఉన్నకాడికి పట్టుక పోత.

కొమురయ్య : అడ్డికి పావుసేరు రాసుకోవి-

వైకుంఠం : అంటవురా ? నిన్ను బొట్టుపెట్టి పిలిత్తినా ?

కొమురయ్య : కరుత పో. (రోషంగా)
వైకుంఠం : (మెత్తబడి) నువ్వు కట్టవని గాదు. నేను సరుకులు దేవాలె. అర ఉద్దెర నడువది.
లక్ష్మి : (ఇంట్లో నుంచి వచ్చి) అన్నా ! మేం ఎన్నడన్న ఎనకముందు పేత్తిమా ? సెక్కర్లబడి ఆలశ్యమయ్యింది గని.
వైకుంఠం : ఔనవ్వా ! నీ మాటెట్లున్నది ? నీ మొగడు గురుకాయించుతుండు.... నాకు తంగుగున్నది. సగమన్న యిస్తే....
లక్ష్మి : ఈ నెల దెబ్బ దాకింది
వైకుంఠం : బాయి పనోనికి దెబ్బ తాకంది ఏనాడు ?
లక్ష్మి : ఏజి బోర్డో గంగరాయో వస్తదంట-పురాగగస్తం.
వైకుంఠం : (పెద్దగా నవ్వి) చచ్చిపోయిన బర్రె పలిగిపోయిన బుద్దెడు పాలిచ్చిందంట- నువ్వు బజాట్ల మీటింగు ఇన్నవా సెల్లె.
లక్ష్మి : అప్పో సప్పో జేసి కరుత
కొమురయ్య : ఇజ్జత్ తీత్తన్నవ్! సోమారం నాడచ్చి నీయినీకు పారేత్త పో....
వైకుంఠం : ఇగో నీ మాటమీద పోతన్న. సోమారంనాడు జూసి ఇగ నేను రాను. మా బాన్ గారత్తడు.
(షాపుకారు వెళ్ళిపోతాడు)
కొమురయ్య : పీనమ్మల.... తు.....బతుకవ్వ.... బద్మాషి బతుకైపోయింది. కట్ట పడ్డోడు అందరికి దొంగే - కంపినోడు పీక్కతింటుండంటే - నచ్చి పెండమ్మి ఈళ్ళు దోసుక తింటండ్లు అందర్ని నిలవెట్టి గొడ్డట నరికిన పాపం లేదు.
లక్ష్మి : కుమ్మరి పనంత గుండెల్నే ఉన్నదిగని కు:డానరాదు. కమ్మరి పనంత కడుపుల్నే ఉన్నదిగని కారు పట్టరాదంట కోపం బాగనే-
కొమురయ్య : నువ్వింట్లకు పో- దెబ్బకన్న నీ సలుపుడే ఎక్కువున్నది.
లక్ష్మి : ఉన్నదున్నట్టంటంటే సచ్చేంత కోపం....
(ఇంతలోనే చీకటి పడ్డట్టుగా లక్ష్మి దీపం పెడుతూండగా ఇద్దరు తలకు బొక్క టోపీలు పెట్టుకొని ప్రవేశిస్తారు. అందులో ఒకరు చంద్రయ్య మరొకరు కార్యకర్త భాస్కర్.)

భాస్కర్ : ఏందక్కో బావ కోపం గురించి మాట్లాడ్తన్నవ్.

లక్ష్మి : సొనొద్దులాయె అన్న- గీ ఏషమేంది? సూడవోతె నువ్వు బాయిల దిగుతన్నవా ఏంది?

భాస్కర్ : మామలు ఎంటబడుతండ్లు - దిగకపోతే తప్పుతాది.
(అంటూనే కొమరయ్య పక్కకు కూర్చుండి దెబ్బ తాకిన కాలు విమిరి)
ఇంకొంచెమైతే కాలే పోతుండే- చెంద్రన్న చెప్పిండు. సేఫ్టీ రూల్స్ అసలు పాటించడం లేదు. దీనికేదన్న చెయ్యాలె

చంద్రయ్య : ఆక్సిడెంట్ల మీద కార్మికులకు సరిగ తెలువది. బాయిమీద మైసమ్మ గుడి కంపినోడు కట్టియ్యంగనే దెబ్బతాకుడు మైసమ్మ మహిమతోటే అనుకుంటరు.

భాస్కర్ : అందరు అట్ల ఉన్నరంటవా? పనిమీద తాకే దెబ్బకు కారణమేమిటో వర్కర్‌కు తెలియదంటవా? కాకపోతే పాత అలవాటు.

కొమురయ్య : కాలు సూడవోతె గిట్లున్నది. డాక్టరుగాడు ఫిట్ చేస్తనంటండు.

చంద్రయ్య : మందమర్రిల గిట్లనే ఫిట్ చేస్తే 56 రోజుల సమ్మె జర్గలేదా? మళ్ళీ గదేతంతు చెయ్యడులే....

భాస్కర్ : అక్కా.... (ముసి ముసి నవ్వుతూ)

లక్ష్మి : ముచ్చెట సంబురాన మర్సేపోయిన మీరట్ల మాట్లాడుకుంట ఉండుండ్లి చాయ్ పెట్టుకత్త.

భాస్కర్ : అక్కా ఇంట్ల గోధుమపిండి ఉన్నదా? కొసంత నీ కెరుకే గద - లై జెయ్యాలె.

లక్ష్మి : మావున్నది (లోపలికి వెళ్ళిపోతుంది)

భాస్కర్ : కరపత్రం తీసి ఒకటి కొమురయ్య కిస్తాడు.

కొమురయ్య : (దాన్ని కిందా మీద చూసి నిట్టూర్చి) పుట్టిన కాన్నుంచి పనేనాయె- దిక్కుమల్లె బతుకుల నాలుగక్షరం ముక్కలు రాకపాయె

చంద్రయ్య : నువ్వొకొన్ని దీసుకో మనోల్లత్తరు గద ఆళ్ళకియ్య.

భాస్కర్ : (టోపి కిందబెట్టి కూర్చుండి అంగి లోపలనుండి కాయితాలు తీస్తాడు) మందమర్రి, గోలేటి, బెల్లంపల్లి, శ్రీరాంపూర్ డివిజన్లన్ని వేజ్ బోర్డు సత్వరమే నిర్ణయించాలని సమ్మె చేస్తున్నారు. సమ్మె విస్తృత

పరచాలి.... ఈ రాత్రే దాదాపు మనకు పీలైనకాడికి దెలిగేట్లను కలును కోవాలె-

చంద్రయ్య : పోలీసోల్లు గస్తీ తిరుగుతండ్లు, సర్కిల్ చాలెంజ్‌గ తీసుకున్నడట. బాయిలు ఎట్ల బందయితయో చూస్తనన్నడట-

భాస్కర్ : కార్మికులు తలుసుకుంటే వాని తాత దిగొచ్చినా సమ్మె జరిగి తీరు తుంది

(కాగితాలు నేలమీద పరిచి చంద్రయ్య, భాస్కర్ నినాదాలు రాస్తుం టారు. కొమురయ్య వాటిని అపురూపంగా తాకుతూ మడత పెడు తుంటాడు)

(లక్ష్మి చాయ్ తెస్తుంది)

భాస్కర్ : జెర దరవాజల కూర్చో అక్కా!

కొమురయ్య : కూసుండంటే ఎరికేనా సెంట్రీ చేసుడు.

లక్ష్మి : మాదండి మాట పట్టుకున్నవయ్య.

## మూడవ రంగం

డ్యూటీ బట్టలతో తలకు టోపీ పెట్టుకొని చంద్రయ్య నడుస్తుంటాడు. అతని వెంట అలాగే తయారయ్యి భాస్కర్ నడుస్తుంటాడు. మొఖం పూర్తిగా కనపడకుండా భాస్కర్ టోపీ కొంచెం కిందికి పెట్టుకుంటాడు.

అగమాగంగా పోశెట్టి ప్రవేశిస్తాడు. దమ్ము తీసుకొని

పోశెట్టి : అవు చంద్రయ్య ఇయ్యాల్ల బాయిలు నడుత్తయా? బజార్లల్ల ఏడ జూత్తె అన్నె పోస్టర్లేసిండ్లు- ఎర్రిలేసిన కుక్కలోలె పోలీసోల్లు ఒక తిర్గుడు గాదు. అగో బాయికచ్చే అడ్డదారిలనే వ్యాన్లు బెట్టుకొని నిలు చున్నరు. గద్ద సూపుల సర్కిల్‌గాడు, బాయి సుట్టంత పోలీసోల్లే నిండిపోయిండ్లు సుమా!

(చంద్రయ్య వెంటున్న భాస్కర్‌ను చూసి మాట బందుజేసిండు)

అంతలోనే రాజమ్మదు ప్రవేశించి -

రాజమ్మదు : అరె బొత్తిలకు లేబరోడు నాదాన్నె పోయిండు. సుట్టు పోలీసోల్ల పైరబెట్టి బాయిలు నడిపిత్తరటన- తెలిసినాకా- ఇగ తట్టలెందుకు

సెమ్మెసులెందుకు- తుపాకులతోని బొగ్గు తవ్వి ఆళ్ళ టోపీలతోని ఎత్తుమనుండ్లి.

పోశెట్టి : బొత్తిలకు అద్దు పిరాదు లేకుంటయ్యింది, మేనేజరు గాన్నే అదు గుదాం పొండ్లి- గీళ్ళను ఎందుకు తెచ్చిండో?

(పోశెట్టి, రాజమ్మలు వెళ్ళిపోయారు.... ఒకటి రెండు నిమిషాల తరువాత వాపసచ్చి....)

పోశెట్టి : అవ్వతోడు మేనేజరు గానికి లాగుబచ్చ వడ్డది. ఆని గది ముందు గోడకే పేపరేసిండ్లు, పోను తీగలు కత్తిరిచ్చిండ్లు-

రాజమ్మలు : అదు తలకాయ బట్టుకొని సమ్మె జెయ్యాక ఎందుకచ్చిండ్లు, నా కొంప ముంచదానికా? అన్నట్టు మాట్లాడుతండు.

(ఇంతలోనే సర్దార్ భూమయ్య ప్రవేశించి కళ్ళకు చెయ్యడ్డం బెట్టుకొని)

భూమయ్య : ఏమైందిరో? మాయరోగం బాకినట్టు ఎక్కడోళ్ళక్కడ నిలబడ్డరు. బాయిబంద్ వెడుతరా ఏంది? దెలిగేట్లు ఏడ సచ్చిండ్లు.

పోశెట్టి : నను నసురాదయ్య అడ్డల బుడ్డోలె- దూదేకుల మియ్యా దడ్డు బట్టు కచ్చినట్లు-

రాజమ్మలు : మేనేంజరు గాడే బొలబొల పోసుకున్నడట ఇగ దెలిగేట్లు దెంక పోయిండ్లు. ఉంటె బూట్ల పేర్లు పడయి.

భూమయ్య : అయితే సమ్మె ఖాయమేనా? (నోరెల్ల బెట్టి)

పోశెట్టి : మ్యాన్‌పే కాడ కాయిద మేసిండ్లు అద్దాల బెట్టుకొని సదువుక పో....

భూమయ్య : నేను అనుకుంటనే ఉన్న బాయిలకిగ్గి తలుగుతదని-

(గొనుగుతూ వెళ్ళిపోతాడు)

(ఇంతలోనే ఎక్కడినుండి వచ్చాయో కరపత్రాలు చల్లబడ్డాయి)

(భాస్కర్ కొద్దిగా ఎత్తుమీద నిలబడి కామ్రేడ్స్! అంటాడు.)

(నిశ్శబ్దమై పోతుంది)

భాస్కర్ : నాలుగో వేజ్‌బోర్డు తొందరగా సెటిల్ చెయ్యాలని గోదావరి అవల దాదాపు అన్ని డివిజన్ల కార్మికులు సమ్మె చేస్తున్నారు. మేనేజిమెంటు, దాని తొత్తు యూనియన్లు, పోలీసులు సమ్మెకు తూట్లు పొడవాలని గస్తీ తిరుగుతండ్లు.

మనకు ఎక్కువ సమయం లేదు. చుట్టూ మోహరించిన పోలీసుల వలయంలో మాట్లాడుకుంటున్నాం. సికాస ఏర్పడ్డనాట్నుండి కార్మికుల కోసం ఎందరో వీరులను అర్పణ చేసింది. నిత్యనిర్బంధం మధ్య కార్మిక పోరాటాలు మీకు కొత్త కాదు.

ముఖ్యంగా మనం రెండు విషయాలు మాట్లాడుకోవాల్సి ఉన్నది. చాలీచాలని జీతంతో, ఎలాంటి సౌకర్యాలు లేక సింగరేణి కార్మికుడు ప్రమాదాల మధ్య తన నెత్తురు చెమట చేసి బొగ్గు తీస్తున్నాడు.... యాజమాన్యం హల్లీ కల్లీ సున్నకు సున్న జూపి జీతాలు మాత్రం పెంచడం లేదు. రెండు సంవత్సరాలుగా చర్చలు సాగదీస్తూ తొత్తు ట్రేడ్ యూనియన్లు యాజమాన్యం బూట్లు నాకుతున్నారు.

అధిక ధరలు, చాలీచాలని జీతాలు, పందుల గుడిసెలు, పని భారం సింగరేణి కార్మికుడు పొట్టచేత పట్టుకొని వచ్చి ఇక్కడ రెక్కలు తప్ప ఏమి మిగుల్చుకోలేకున్నాడు. ఈ దోపిడీ దౌర్జన్యాలను విలదీసి అడిగినందుకే గనులు పోలీసు క్యాంపులయ్యాయి. అరెస్టులు, ఎన్‌కౌంటర్లు డిస్‌మిస్‌లు లేని రోజు లేదు.

కామ్రేడ్స్! ఈ బాధలు, కష్టాలు మీకు తెలియనివి కావు తాతకు దగ్గులు నేర్పినట్టుగా ఉంటది. ఎక్కువ సమయం లేదు. సమ్మె విద్రోహుల్ని ఎదిరిస్తూ వేజిబోర్డు సెటిలయ్యేదాక సమ్మె కొనసాగించాల్సిందిగా సికాస విజ్ఞప్తి చేస్తోంది.

సమ్మె నూతన ప్రజాస్వామిక విప్లవ సాధనలో రిహార్సల్ లాంటిదే.

పోరాడితే పోయేదేమీ లేదు బానిస సంకెళ్ళు తప్ప.

కార్మిక ఐక్యత వర్ధిల్లాలి!

సికాస జిందాబాద్

(భాస్కర్ దిగిపోయి మందిలో కలిసిపోయాడు. వాన వెలిసినట్లయ్యింది)

భూమయ్య : కలదు కలదండనే వాడు కలడో లేడో- గోవిందా బాయిలన్ని గోవిందా!

పోశెట్టి : అన్నలు బాంబుమీది కచ్చిండ్లు అనంగనే మేనేజరు గాడు తట్టెడు ఏరుక్కున్నడు. (నవ్వుతూ)

చంద్రయ్య : సికాస జిందాబాద్

పోశెట్టి : బందు. బందు. బాయిలు బంద
రావాలె రావాలె వేజ్‌బోర్డు రావాలె-
రాడికల్స్ జిందాబాద్.
(నమ్మె మీ జన్మహక్కు రోరన్న.... పాట వినిపిస్తూ ఉంటుంది. నినాదాలు మిన్నుముడుతాయి.)

## నాలగవ రంగం

ఏఐటియుసి మీటింగు నర్సయ్య లీడరు ప్రేక్షకుల నుద్దేశించి మాట్లాడుతూ వుంటాడు. స్టేజిమీద అటు ఇద్దరు ఇటు ఇద్దరు కూర్చుంటారు. రాజమ్మదు, పోశెట్టి ఒకవైపు కొమురయ్య, చంద్రయ్య మరోవేపు, లీడరు ఎడంచెయ్యి రొండికానించు కొని కుడిచేయి తిప్పుతూ కార్మికుల భాషలో ఇలవరికె బెట్టి అచ్చం రైతులాగా మాట్లాడుతూ వుంటాడు.]

పోశెట్టి : గోలుకొండ సుతారి వచ్చిండయ్యా!

రాజమ్మదు : ననరాదో - అన్ని నీకే తెలిసినట్టు - ఏందో చెప్పనియ్యరాదు.

పోశెట్టి : ఏంజెప్పుతాడు మొన్న ఢిల్లిల ఏర్గబోయిన - నిన్న కలకత్తల కాల్లు కడిగిన

రాజమ్మదు : అల్లుకుబోతె పిల్లి ని సంకల వెట్టుక పోయినట్టు - ఏడ ఇననియ్య వయితివి. (లేచివచ్చి కొమురయ్య పక్కన కూర్చుంటాడు.)

నర్సయ్య : (చిరునవ్వు నవ్వి) చేతులూపి.

ఏసిందే గంతు దిగిందే బిడ్డ అంట ఉరుకులాడితే అయితదా ? యూనియ నంటేంది ? దానికో పద్దతి ఉంటది. మన ఎర్రజెండ పార్టీ నాయకత్వంలో కొట్లాడి ఆరణాల కూలి అరువై రూపాల దాకా సాధిచ్చుకున్నం. మీకందరికి ఎరుకున్న సంగతే. మేము తుపాకులు పట్టినం నైజామ్ సర్కారుపండగ సాయుధ పోరాటం జేసినం.

పోశెట్టి : ఏడ జేసింట్లో బాంచెన్....(తను లేచివచ్చి రాజమ్మదు పక్కన కూర్చుం టాడు.)

నర్సయ్య : (అదేమి పట్టించుకోకుండానే....) కామ్రేడ్స్ ! మీరు శాంతంగ ఉండాలె- నేను చెప్పే నాలుగు ముచ్చెట్లు ఇనాలె - బూర్జువా యాజమాన్యం మెడలు వంచాలంటే కార్మికులు ఎట్లా పోరాడాలో మన కామ్రేడ్ లెనిన్ చెప్పనే చెప్పిండు....సమస్యలను శాంతంగా అర్థం చేసుకోవాలె - విన్నరా ? బోడనెత్తికి రాళ్ళ వానకు దంటంట - ఓ పక్క వేజ్‌బోర్డు కమిటీ పెట్టు కున్నమా ? అందట్ల నేను మెంబరేనాయె - మీకందరికి తెలిసిందేనాయె.

పోశెట్టి : తెలిసిన సంగతులే మల్ల మల్ల ఎందుకు చెప్పుతరు సారూ !

నర్సయ్య : అత్తన్న కామ్రేడ్స్ ! అసలు టైంటుకే అత్తన్న. ఇయ్యాల పొద్దున విమానంల ఢిల్లికి పోయేదుండె - కాని సమ్మె ఇట్లా జరుగుతంది. శ్రీరాం పురంల బస్సులు గాల్చిండ్లు బెల్లంపల్లిల డంపరు కాల్చిండ్లట. ఎన్‌టిపిసికి పోయె బ్రిడ్జి బాంబులుపెట్టి కూలగొట్టిండ్లు. అది పోనియ్యి ఎర్రజెండ పేరుమీద సమ్మెచేసేటోళ్ళు ఎర్రజెండ ఆఫీసులే కాలబెడ్తండ్లు గవర్నమెంటు పోలీసుల దెచ్చింది.... ఇవి దుందుడుకు చర్యలు కాదం టరా ? వేజ్‌బోర్డుకు బస్సులకేమన్న సంబంధమున్నదా ?

కొమురయ్య : (లేచిపోయి) గిట్ల మాటలు చెప్పే మా కొంపలు ముంచిండ్లు, మాట లట మాటలు - మాటలకు మంత్రాలకు సింతకాయలు రాలయి.

(చేతులూపుతూ తానే ఉపన్యాసం యివ్వబోయాడు. చెంద్రయ్య వచ్చి కొమురయ్యను తీసుకపొయ్యాడు.)

నర్సయ్య : కామ్రేడ్స్ మీరు కొందరిమాటలు బట్టుకొని ఏగిరపడ్తండ్లు. అనవసరంగా ఉబ్బిల పడ్తండ్లు. అనవసరంగా సమ్మె చేస్తండ్లు (గొంతుమార్చి) అబ్బా యికి అమ్మాయికి పెండ్లయ్యింది· శోభనం కూడా ధూంధాంగ జేసినం. గర్భధారణ కూడ అయ్యింది. నవమాసాలు నిండి పోయినయి. రేపో మాపో పిల్లో పిలగాడో ఈతల బడుతడు....వేజ్‌బోర్డు గంతే - కాలం రానిది కను కనుమంటె - గీమాత్రందానికే తొందర పడితె ఎట్ల ?

పోశెట్టి : (లేచి నిలబడి చేతులు జోడించి) మహారాజా !

నర్సయ్య : (కాస్తవంగి) ఫర్వాలేదు కామ్రేడ్ చెప్పు.

పోశెట్టి : (సిగ్గుపడుతూ మైకు దగ్గరికొచ్చి) ఎప్పటి తీర్గ మళ్ళ ఈడ్సుకపోతే ఎట్ల మారాజా....

నర్సయ్య : ఆ కార్మికుని భయం కూడా నిజమే. కాని కామ్రేడ్స్ అట్లా జరగదు. అంతా సిద్ధమైంది. లాడీసోల్ల జీతాలు నిర్ణయమైనయి. కమానోల్ల జీతాలు ఖండితమైనయి.

పోశెట్టి : ఏమగంత ఎల్లిందిగాని తోకమట్ల ఎల్లలేదు. దాన్ని పట్టుకొని లీడర్లంత ఈడిగిలబడి గుంజుతండ్లు.

నర్సయ్య : మన కామ్రేడ్ మంచి హాస్యగాడు. ఆయనన్నట్టుగ ఇగ సంతకాలే మిగిలినయ్. ఇది వాస్తవం.

ఎవరో ఏదో చెప్పితే వాళ్ళ మాటలు బట్టుకొని మీరు బాయిలు బందుపెడితే వేజ్‌బోర్డు సంగతటుంచుండ్లి. మీజీతాలే పోతన్నయి. ఇయ్యాల్టికి ముప్పయి మూడు దినాలాయె. అసలు రాడికల్స్ ఎంత మందున్నరు. వాళ్ళకు వేజ్‌బోర్డు గురించి తెలుసునా ? కరువుభత్యం సంగతెరికేనా ! నా దగ్గర అన్ని వివరాలున్నయి. వాళ్ళను రమ్మనుండ్లి. నేను అన్ని చూయిస్త.

వాళ్ళు రారు. వాళ్లున్నరా ? అసలు వాళ్ళు ఎక్కడుంటారో ?

రాజమ్మదు : పిస్సముండ కొడుకున్నట్టున్నది. సమ్మె నడుత్తందంటడు. గింత మందిని ముందట బెట్టుకొని అసలున్నరా అంటండేంది ? గీనికి లేబ రోల్ల సంగతే తెలువది. ఇగ వేజుబోర్డేమెరుక ?

పోశెట్టి : గీడ చెప్పేది ఉసికెల ఉచ్చబోసినట్టే - (దిగిపోతాడు.)

కొమురయ్య : (కాండ్రికిచ్చి ఉమ్మేసి పోతాడు)

సికాస జిందాబాద్....

కార్మికుల ఐక్యత వర్ధిల్లాలి !

వేజ్‌బోర్డ్ వచ్చేదాకా సమ్మె కొనసాగాలి.

మేనేజ్‌మెంటు తొత్తులు డౌన్ డౌన్.

నర్సయ్య : మైకు పట్టుకొని గొంతు చించుకొని ఏదో చెప్పుతుంటాడు. మాటలేవి వినబడవు. అందరు లేచిపోతారు.

## అయిదవ రంగం

కొమురయ్య, భాస్కర్, రాజమ్మదు, చంద్రయ్యకూర్చుండి ఉంటారు.

రాజమ్మదు : అఖరుకత్తె అట్టి బొక్కలకు కొండ్రిగాడు దెబ్బలు పడ్డట్టున్నది.

చంద్రయ్య : వేజుబోర్డు హల్లికల్లి సున్నకు సున్నసే అంటివే మామ.

కొమురయ్య : నీ తల్లి లొల్లిల లొల్లి లీడరుగాళ్ళను బట్టుకొని ఏర్గేదాక కొట్టేదుండె.

భాస్కర్ : కామ్రేడ్స్. సమ్మె ముప్పయైదు రోజులు నడిచింది. ఈ సమ్మె వేజుబోర్డు కోసమే నడిచినా - సమ్మె ఫలితాలను జీతాలల్లోనే చూద్దామా ? ఇంకేమైనా ఉన్నదా ?

రాజమ్మదు : (నెత్తి గోక్కుంటూ) పోలీసోల్లు చాలెంజుకి తీసుకొన్నరు. పోలీసోల్లు సమ్మెనాపలేక - సమ్మె మొదలైన బాయికాన్నే బొచ్చెలటువొంటి ముగ్గురు పొల్లగండ్లను కాల్చేసిరి.

కొమురయ్య : అన్నా నువ్వు అచ్చచెప్పు దెబ్బకు దెబ్బ డియ్యకపోతే కలువది.

భాస్కర్ : వాళ్ళ ముఖాలమీద ఆసిడ్ పోసిండ్లట. మనదగ్గరనైతే ఎవర్ని పట్టుక పోయిండ్లనేది తేలలేదు.

చంద్రయ్య : వాళ్ళ నెక్కన్నుంచి తెచ్చిండ్లో, మన దగ్గరోల్లు కానట్టున్నది.
(కాసేపు మౌనం. అందరి మనసుల్లో వాళ్ళ మెదిలారు)

రాజమ్మదు : నేను మంత పట్టుకొని పోయి చూసచ్చిన. దగ్గెరికి రానియ్యలే. అవ్వతోడు నాకు ఇప్పటికి వాళ్ళ మతికత్తె బుక్కెడు బువ్వ తినలేక పోతన్న.

కొమురయ్య : అన్న నాకు కడుపుల దేవినట్టున్నది.

భాస్కర్ : కామ్రేడ్స్ మనది దీర్ఘకాలిక పోరాటం. ఒక్కొక్కప్పుడు వానిదే పై చెయ్యి - ఇప్పటికి ఉత్తర తెలంగాణా జిల్లాల్లో దాదాపు 20 మందిని చాటు మాటుకు కాల్చేసిండ్లు. ప్రజలు ఊకున్నారా ? దాదాపు ఉత్తర తెలంగాణా స్తంభింపజేశారు. అమరవీరుల త్యాగాలను మనం గుర్తుంచుకోవాలి. పరిపూర్తి చెయ్యాలి.... ఉద్యమం ఆగిపోయిందా ? ఇంతటి నిర్బంధంలో కూడా మన కార్మికులు సమ్మె చేసి విజయం సాధించారు. (కాసేపు ఆగి) ఈ సమ్మె పెల్లుబికిన జనం కోపంగా ఎందుకు చూడకూడదు.

నిజానికి మనకు కార్మికుల నందుకునేంత నిర్మాణం లేకపోయింది. కార్మికులు ఎక్కడికక్కడ కదిలి బస్సులు కాల్చేశారు. బ్రిడ్జి పేల్చేశారు.

రాజమ్మడు : మా బాయిమీదనైతే మేనేజరు పోలీసోల్లు కలిసి-పేజీబోర్డు అచ్చిందని రాడికల్స్ అంటరాసి గోడల కతికిచ్చిండ్లు. ఒక్కడు నమ్మలే.

భాస్కర్ : కార్మికులేమంటండ్లు-

రాజమ్మడు : సి పి ఐ డెలిగేట్లు ఏమయ్యింది, ఏమయ్యిందని జబ్బలెగిరేత్తండ్లు.

చంద్రయ్య : తీవ్రవాదుల మూలకంగా కార్మికులు చీటికి మాటికి సమ్మెలు చేస్తే కంపెనికి నష్టమ స్తదంట

భాస్కర్ : కంపెనీకి నిజంగనే నష్టాలు వత్తన్నయంటరా!

రాజమ్మడు : ఏమో ఎవలకెరుక, లెక్కల భాగోతం.

భాస్కర్ : కంపెనీ సంవత్సర లెక్కల్ల కోట్ల నష్టం సూపెడుతుంది.

రాజమ్మడు : ఏనుగుడిన్న ఎలక్కాయ తీర్గ మరి మన రెక్కల కట్టమంత ఏడ పోబట్టె—

భాస్కర్ : నిజంగ సింగరేణికి నష్టాలు వత్తన్నయా? వత్తె కార్మికులు సమ్మె జేత్తెనే అత్తన్నయా?

కొమురయ్య : అన్న జెర చెప్పే-

భాస్కర్ : నష్టాలు సూపెడుతండ్లు. లేబరోల్ల జీతాలు, మిషన్లు ఇతర ఖర్చులన్ని నష్టాలు సూపెడుతండ్లు. లంకాసు ఎక్కడున్నదో ఎరికేనా? అవుతల పైవేటోడు పెట్టుకున్న కంపినే సూడు. సిమెంటున్నదనుకో - అడు అన్ని కర్చులు కలిపి ధర వెడుతడు. మన సింగరేణోడు టన్నుకు నూరురూపాలు నష్టాని కమ్ముతండు. మరి బొగ్గు ఎవలకమ్ముతడయ్యో! అంటే కరంటు, రైల్వేలు, పైవేటు పెట్టుబడిదార్లకు. మల్లి కరంటు అగ్గువ సగ్గువ ఎవడు వాడుకుంటడయ్యా, అంటే పైవేటోడు. ఆఖరుకు గవర్నమెంటు కింద నడిచే సింగరేణి పైవేటోనికి తనకు పడ్డ ధరకన్న తక్కువకు అమ్ముతున్నది. అంటేందన్నమాట - స్వాతంత్రం రాకముందు 40 కోట్లకున్న టాటాలు, బిర్లాలు 20 వేల కోట్లకు పెరిగిపోయిండ్లు. కూలోడు కొటికయ్యిండు.

కొమురయ్య : ఓర్నియవ్వ మోసం ముండకొడుకులు.

భాస్కర్ : మన స్వాతంత్రమే పెద్ద మోసం ప్రజల సొమ్ముతోని పబ్లిక్ రంగంలో పెద్ద పరిశ్రమలు పెట్టింది. అండ్ల తయారైన యంత్రాలు బొగ్గు,

కరంటు ప్రైవేటోనికి అగ్గువ కమ్ముడు, జనం వాడుకునే గుత్తకొన్నుంచి సకలం ప్రైవేటోనికిచ్చింది. వాడు దోసుకున్నంత మాఫీ....

రాజమ్మదు : పోంగ పోంగ అంత దొంగలు దొంగలు ఊళ్లు పంచుకున్నట్టే ఉన్నది.

భాస్కర్ : కనుక కామ్రేడ్స్ : అటు పల్లెల్ల పటేలు దొరల మూలకంగా భూమి పోగొట్టుకొని కడుపుసేత బట్టుకొని బతుకవోయే టోల్లెక్కువయ్యిండ్లు. ఈడ కంపినీ సావకుంట బతుకకుంట జీతాలిత్తంది. ఇంకా మనిషి జాగల మిషన్లు పెడుతరట — పల్లెల్ల దొరలు — ఇక్కడ పెట్టుబడి దార్లు. అంటేందన్నమాట అర్ధవలస అర్ధభూస్వామ్య ప్రభుత్వం పోయి కూలిరాజ్యం వచ్చేదాక కొట్లాడాలె.

కొమురయ్య : ఒక్కొక్కన్ని ఏరేరి సంపవట్టిరి.

భాస్కర్ : ఎందర్ని సంపుతరు. ఆకట వచ్చే బదులు లడాయిలనే సత్తమనుకుంటరు. ప్రజల్ల కోపం ఉన్నది. వాళ్లను నిర్మాణంలో పెట్టుకోవాలె. ఒక వీరుడు మరణిస్తే .......

(పోలీసులు పోలీసులు అంటూ లక్ష్మి పరుగెత్తుకొస్తుంది.)

తలోదిక్కు పరుగెత్తుతారు .... కొముకయ్య పరుగెత్తేలోగా పడిపోతాడు. భాస్కర్ లేవబోతాడు. ఇంతలోనే పెడరెక్కలు విరిచి కట్టి భాస్కర్‌ను తీసుక పోతారు .... కొమురయ్యను పట్టుకుంటారు .... వెనుక పరుగెత్తుకొచ్చిన సర్కిల్ నడిపించుకపోతున్న భాస్కర్‌ను ఆపి పట్టుకున్న వాళ్ళను పక్కకు జరుగమని కాలుస్తాడు.

(అందరు సివిల్ డ్రెస్‌లో ఉంటారు)

భాస్కర్ 'విప్లవం వర్ధిల్లాలి' అంటూ నేలకొరుగుతాడు.

## ఆరవ రంగం

సైరన్ కూస్తుంటుంది. అమరవీరుల మీది పాట (సింగరేణిలో అమరులైన వాళ్ళ మీది పాట) విన్పిస్తుంది. అమరవీరుల తలుచుకొని కార్మికులు విచారంగా ఉంటారు.

రాజమ్మదు, పోశెట్టి, చంద్రయ్య డ్యూటీ బట్టల మీద ఉంటారు. కొమురయ్య గడ్డం పెరిగి - చిరిగిన బట్టలేసుకొని వస్తాడు,

రాజమ్మదు : ఎప్పటి సిప్ప ఎనుగులనే అయిపాయె.

చంద్రయ్య : కొమురయ్య బావా నీ మీద కేసు బెట్టింల్లా, పట్టిగనే ఇడిసి పెట్టిండ్లా?

కొమురయ్య మాట్లాడడు - ఉరిమే మేఘంలా ఉంటాడు.

భూమయ్య : ఏమాయెనుర్రా - బాయిల దిగేదున్నదా? లేదా? ఏమాయెనో కొమురాలు. వచ్చినవా? వద్దుర్రా అంటే వినకపోతిరి. మామల తప్పిచ్చుకున్నవు గాని మొగడు పిలుత్తండుపో

(కొమురయ్య, చంద్రయ్య పరదాలోపలికి పోయి కాయిదంతో వస్తారు. చంద్రయ్య కొమురయ్య చేతిలో కాయిదం తీసుకొని చదువుతుంటాడు. భూమయ్య వెళ్లిపోతాడు.)

చంద్రయ్య : ఎనిమిది దినాలు ఆబ్సెంటు అయ్యిండట. డిస్‌మిస్ చేసిండ్లు.

కొమురయ్య : (చంద్రయ్య దగ్గర కాయదం తీసుకొని చింపేసి తొక్కుతాడు. పూనకం వచ్చినోని తీర్గ) నౌకరి వాళ్ల ముడ్డి కింద పెట్టుకోనియ్యి. నీయవ్వ అందరిని గావు పడుత - బాయిలకు అగ్గి పెడుత.

(అంగి చింపుకుంటాడు.)

చంద్రయ్య : (కొమురయ్యను అపుతాడు.) కామ్రేడ్స్! (చంద్రయ్య గద్దెనెక్కుతాడు.) .... ఇదన్యాయం కొమురయ్య ఆబ్సెంటెందు కయ్యిండు. పోలీసోల్లు పట్టుక పోయిండ్లు - ఇయ్యాల్ల కొమురయ్య వంతు. రేపు మనందరి వంతు - బాయిల మీద పోలీసులే రాజ్యమేలుతే వాళ్ళే బొగ్గు తవ్వుకోనియ్యి .... మన కామ్రేడ్ భాస్కర్ ఇంటి నుంచి పట్టుక పోయి కాల్చేసిండ్లు — గిదీనికి ఉవరు లేదా?

పోశెట్టి : డోలు కడుపు సేనేజరోన్ని అడుగుదాం పాండ్లి.

రాజమ్మదు : (భుజం మీది ఎర్ర పంచె ఎగిరేస్తాడు)

పోలీసుల దౌర్జన్యం నశించాలి.

కొమురయ్య డిస్‌మిస్ రద్దు కావాలి.

సి కా స జిందాబాద్

(కొమురయ్య కోపంగా అరుస్తూ ఏదో చెప్పతుంటాడు. చంద్రయ్య చేతులూపుతూ ఏదో మాట్లాడుతుంటాడు.

నినాదాలు మిన్నుముడుతాయి.)

ఒక వీరుడు మరణిస్తే -

ప్రభవింతురు వేలకొలది.

సమీక్ష :

# రా. రా. లేఖలు

చలసాని ప్రసాదరావు

తెలుగు సాహిత్యంపై మెరుపులా మెరిసి, ఉరుములా ఉతిమి, అత్యల్ప కాలంలోనే మెరుపులాగే మాయమైపోయిన విశిష్ట వ్యక్తి రాచమల్లు రామచంద్రారెడ్డి.

1968 ఏప్రిల్‌లో వెలువడిన త్రైమాసపత్రిక "సంవేదన" తొలి సంచిక తోనే రారా యావత్ తెలుగు సాహితీ లోకాన్ని ఆకర్షించి, అవిస్మరణీయుడుగా నిలిచాడు. 1969 అక్టోబరులో వెలువడిన ఆఖరు సంచిక నాటికి మొత్తం ఏడు "సంవేదన" సంచికలు ప్రచురితమై సాహితీపరులలో గగ్గోలు పుట్టించాయి. సాహిత్యాన్నీ, సాహిత్య విమర్శనూ సీరియస్‌గా తీసుకునేలా ఈ రంగంలోని వారిలో ఆలోచనను, పునరాలోచనను ప్రేరేపించాయి. సాహిత్య ప్రయోజనం పట్ల, సామాజిక బాధ్యత పట్ల కొంతయినా జాగ్రత్తగా వ్యవహరించేలా అదుపులో పెట్టాయి.

"దురదృష్టవశాత్తు భారత జాతీయ జీవితం సర్వాంగాల్లోనూ కుళ్ళి కంపుకొడు తున్నది. ఆ కంపు సాహిత్య రంగాన్ని మినహాయించలేదు. రాజకీయ రంగంలో లాగే సాహిత్య రంగంలో కూడా అయోగ్యులూ, అనధికారులూ, కుక్షింభరులూ, ఆత్మస్తుతి పరాయణులూ, జోహుకుందారులూ, పగటి వేషగాళ్లూ పెత్తనం సాగిస్తు న్నారు. ఈ సాహిత్య చేరిగాళ్ల పట్ల దయాదాక్షిణ్యాలు చూపటం వల్ల తెలుగు సాహిత్యం బాగుపడుతుందని మేము అనుకోవడం లేదు. మన ప్రవర్తనలో నాగరి కతా, సంస్కారమూ ఉండవలసినమాట నిజమే, కానీ, సాహిత్యాన్నీ, జాతి జీవి తాన్నీ కలుషితం చేసే ప్రచారణ పరాయణులను ద్వేషించటానికి అవి అడ్డం రాకూడదు. మధ్య తరగతి జీవితపు కృత్రిమ మర్యాదలు సాహిత్య విమర్శకు శృంఖలాలు కాకూడదు".... అనే లక్ష్య నిర్వచనంతో ("సంవేదన" సంపాదకీయం, ఏప్రిల్ 1968) ఎంతటి వారినీ లెక్కచేయకుండా రా. రా. విమర్శకునిగా వీరవిహారం చేశాడు. తాను అమితంగా అభిమానించి, ప్రేమించి, గౌరవించే శ్రీశ్రీ చేతనే "క్రూరుడైన విమర్శకుడు"గా బిరుదునందుకుని కూడా చలించకుండా కలమే ఖడ్గంగా, ఒంటరిగా, వీరాభిమన్యునిలా ముందుకు దూసుకుపోయాడు. "సంవేదన"లో ఆయన రాసిన కొన్ని గ్రంథ సమీక్షలే వ్యాసాలుగా, ఆ తర్వాత 1976 లో పుస్తక రూపాన

వెలువడి, పునర్ముద్రణ కూడా పొందాయంటే, అవి సాహితీపరులను ఎంతగా ఆకట్టుకున్నాయో ఊహించవచ్చు. దీనితోపాటు "అలసిన గుండెలు" పేర వెలువడిన ఓ కథల సంపుటి, 1987 లో వెలువడి మరో సంచలనానికి కారణమైన "అనువాద సమస్యలు".... ఇవే ఆయన మనముందుంచిన స్వీయ రచనలు.

"రారా" ఖావాలుగానీ, రచనలు, విమర్శలు, సమీక్షలుగానీ లోపరహితాలు కావు. అయినా ఎవరిచ్చారోగానీ, ఆయనకు అంటగట్టిన "మార్క్సిస్టు మేధావి రారా" అనే బిరుదుకు ఆయనొక్కడే అర్హుడేమోననే విధంగా ఆయన రంగప్రవేశం చేసిన నాటి పరిస్థితులున్నాయి.

ఆనాటికి అతివాద రాజకీయాలను అభిమానించే సాహితీపరులకు గల ఏకైక వేదిక అనుకుంటున్న "అరసం" నిర్వ్యాపారంగా, ఎవరికీ ఏదారీ చూపలేని సంస్థగా మారిపోయింది. నానాగోత్రీక "అభ్యుదయ వాదుల" వేదికగా మిగిలిపోయింది. రారా గొప్పగా గౌరవించి, అభిమానించే శ్రీశ్రీ, కొ.కు, కె.వి.ఆర్ వంటి హేమాహేమీలు నాయకులుగా ఉండికూడా పాతకాలపు "అభ్యుదయ సాహితీవేత్తల" కలగూరగంపను వదిలించుకుని, ఉత్సాహంతో ఉరకలు వేస్తూవస్తున్న యువతరానికి నాయకత్వం వహించటంలో విఫలమైంది. మారిన పరిస్థితుల్లో మార్క్సిజం ప్రామాణికంగా నిర్ద్వంద్వంగా లక్ష్య నిర్వచనం చేసుకుని "నిబద్ధ" సంస్థగా నిలదొక్కుకునే ప్రయత్నం ఏ మాత్రం చేయకుండా "సెవెన్ స్టార్స్ సిండికేట్" వారి తోకపుచ్చుకుని ఒడ్డుకుచేరే ప్రయత్నంలో పడింది.

బాధ్యతగల పెద్దలూ, గర్వించదగిన చరిత్రాగల ఈ సంస్థ తాలూకు నిర్లిప్త ధోరణిలోంచి అటు "ఫ్రీవర్స్ ఫ్రంట్" పేర ఓ పీఠాధిపతిగారూ, ఇటు అందర్నీ హడలగొడుతూ "దిగంబర కవులు" రంగప్రవేశం చేశారు. వీరి మూడు కవితా సంకలనాలూ 1965-68 కాలంలోనే వెలువడినాయి. వీరి ఉధృతిని చూసి, మరో లక్ష్యంతో "తిరగబడు" కవులు తమ జెండా ఎగురవేశారు. "అరసం" వారు ప్రాణం పోసుకుందామనుకున్న సెవెన్‌స్టార్స్ సిండికేట్ వారి "అభ్యుదయ సాహిత్య సదస్సు" హైదరాబాదులో 1970 జూలైలో జరిగింది. ఈ సదస్సును బహిష్కరించి శ్రీశ్రీ, కొకు, కె.వి.ఆర్, దిగంబరులు, తిరగబడుకవులు, విశాఖ రచయితలు ముఖ్యులుగా ఆ 1970 జూలై 4వ తేదీనే "విరసం" ఆవిర్భవించింది.

దీని ప్రకారం రారా "సంవేదన" ఆరంభించే నాటికి (1968 ఏప్రిల్) దిగంబర కవులే సాహిత్యరంగంలో ప్రముఖులుగా ఉన్నారు. "తిరగబడు" కవుల తొలి కవితా సంపుటి 1969 డిసెంబర్‌లోగానీ బయటికి రాలేదు. మిగతాదంతా "రారా" పైన పేర్కొన్న "పేరిగాళ్ల రాజ్యం"గానే మిగిలి ఉంది.

ఒక సాహితీపరుని భావాలు అతని రచనల్లో స్పష్టం అయితే, ఆ భావాలు అలా రూపొందటానికి లేదా పరిణితి చెందటానికి మూలాన అతను సన్నిహితులకు రాసుకునే "లేఖలు"లో బయల్పడుతాయనుకోవచ్చు. వ్యక్తుల మధ్య నడిచే ప్రైవేటు ఉత్తరాలు సాధారణంగా అరమరికలు లేకుండా స్వచ్ఛంగా ఉండే అవకాశం ఎక్కువ. ఆ దృష్ట్యా ఎవరికి ఇష్టమైనా, కాకున్నా తెలుగు సాహిత్య విమర్శనా చరిత్రలో అవిస్మరణీయుడుగా నిలచిపోయిన రారా అంతరంగాన్ని మరింతగా అర్థం చేసుకోడానికీ, వ్యాసాల్లో ఆవిష్కృతంగాని ఆయన అభిప్రాయాలను మరి కొన్నింటిని తెలుసుకోడానికీ ఈ "లేఖలు" బాగా ఉపకరిస్తాయి.

ఆ దృష్ట్యా "రారా స్మారక సమితి" పేర ప్రొద్దుటూరునుండి ఆయన మిత్రులు రారా తన సాహితీ మిత్రులకు రాసిన లేఖలు కొన్ని సేకరించి ప్రచురించిన 300 పేజీలు "రారా లేఖలు" పుస్తకం రారా అంతరంగానికి అద్దం అనుకోవచ్చు.

"అరసం"తో, అందులోని ముఖ్యులతో, అలాగే సి.పి.ఐ. వారితో ఆయనకున్న చిరకాల అనుబంధాల వలన, రాజకీయ-సంస్థాగత అభిప్రాయభేదాలతో "విరసం"ను ఆహ్వానించలేకపోయినా విరసం స్థాపనలోని అవసరాన్ని గుర్తించేడు రారా. దిగంబరులు సంస్థలో ప్రముఖంగా ఉండటం వలన సంస్థ, అందులోని వ్యక్తుల చిత్తశుద్ధి గురించి అనుమానాలు పెంచుకున్నా విరసం ప్రకటించుకున్న సిద్ధాంత నిబద్ధత ఆయన్ను ఆకట్టుకుందని ఈ "లేఖలు" వలన స్పష్టం అవుతుంది. కొన్ని కొన్ని సందర్భాలలో వ్యక్తుల వ్యక్తిగత ధోరణులే సంస్థాగత ధోరణులుగా ప్రచారమై సంస్థకు హాని చేస్తాయనేది మన అనుభవం లోనిదే.

మహీధర రామమోహనరావుగారికి 16-12-1970న రాసిన ఓ లేఖాంశం ఇలా వుంది.

"అరసం ఆర్గనైజ్ కావటం మీరన్నట్లు కష్టమే. నామతః ఆర్గనైజ్

అయినా సాధించబోయేది ఏమీ ఉండదు. విరసం వాళ్ల పొలిటికల్ లైన్ తప్పయినా కనీసం వాళ్ళకు ఒక రివల్యూషనరీ జీల్ ఉన్నది. అంతకంటే ముఖ్యంగా మార్క్సిజంలో విశ్వాసం ఉన్నది. అరసం వాళ్ళలో నాకేదీ కనిపించటంలేదు. అభ్యుదయ సాహిత్యానికి మార్క్సిజం అక్కర్లేదు అన్న ధోరణిలో పత్రికల్లోనూ, వేదికల మీద బాహాటంగానే కొందరు అంటున్నారు. మొత్తంమీద అభ్యుదయ సాహిత్యాన్ని ఆంటీ ఫ్యూడల్ లక్ష్యాలకు పరిమితం చేసే ధోరణి మనవాళ్ళలో కనిపిస్తున్నది. ఆ లక్ష్యాలు 1950 వరకూ, బహుశా 1960 వరకు బాగానే ఉండి ఉండవచ్చును. 1970లో కూడా మన రాజకీయాలుగానీ, మన సాహిత్యంగానీ ఆంటీ కాపిటలిస్ట్ దశకు చేరుకోలేదనుకోవడం రాజకీయ మూర్ఖత్వమూ, గుడ్డితనమూ మాత్రమేకాదు, రాజకీయ ద్రోహం....

"విరసం ఏమి సాధిస్తుందో నేను చెప్పలేను గానీ కుటుంబరావుగారు అన్న ఒకమాట నాకు బాగా నచ్చింది. విప్లవ పరిస్థితి ఏర్పడినప్పుడు విప్లవ సాహిత్యం సృష్టించటంకాదు, రచయితల కర్తవ్యం, ఆ పరిస్థితి ఏర్పడటానికి దోహదం చేయటం. ఈ మాటతో మనం ఏకీభవించక తప్పదు. రచయితకు ఆ మాత్రం భవిష్యద్దర్శనం ఉండాలి. తప్పైనా, ఒప్పైనా కనీసం ఆ మాత్రం స్వేచ్ఛ అయినా ఉండాలి...." (రారా లేఖలు, పేజీ 151).

ఇలా రాసిన వ్యక్తి ఇతరత్రా ఏం చెప్పినా "విరసం" ఆవిర్భావాన్ని సరిగానే అర్థం చేసుకుని, మౌనంగానే అయినా ఆహ్వానించాడనటానికి అభ్యంతరం ఉండనవసరంలేదు. పైగా ఆయన అరసం దారి తప్పిపోవడాన్ని స్పష్టంగా గుర్తించినట్లూ, అయినా గత్యంతరంలేక పార్టీ జాన్ మన స్తత్వంతో అందులోనే ఉండిపోయినట్లూ 214వ పేజీలోని గజ్జెల మల్లారెడ్డిగారికి రాసిన లేఖాంశం స్పష్టం చేస్తుంది.

"ఇక్కడి అరసం కార్యకలాపాలలో నేను పాల్గొంటూనే ఉన్నాను. ఆ విషయం నీవెందుకు రాసినావో నాకు అర్థం కాలేదు. కాకపోతే విరాళాలు నేను వసూలు చేయలేను గనుక, అయిదువేల రూపాయలు వసూలు చేస్తామనే సాహసపరులు మహాసభకు సినిమా తారలను ఆహ్వానించాలని ప్రతిపాదించినపుడు కాదనలేకపోతున్నాను. మరి మొన్న గవర్నరుకు ఆహ్వానం పంపినారు. నేను ఏ లోకంలో ఉన్నానో నాకు తెలియటంలేదు—కానీ సహకరిస్తూనే ఉన్నాను" (3-11-1976)

రారా దిగంబరకవులను తీవ్రంగా అసహ్యించుకుంటున్నాడనేది ఒక యదార్థం. అయితే ఒక్క రారాయే గాదు, ఆనాటికి ఈనాటికి సాహితీపరుల్లో అనేక మంది పైకెలా నటించినా లోలోపలా, ప్రైవేటు సంభాషణల్లోనూ అంతకన్నా తీవ్రంగా వారిని అసహ్యించుకోవటమూ, వారికి వచ్చిన పేరు ప్రఖ్యాతులకు అసూయతో కూడిన అంతర్గత ద్వేషాల్ని పైకి కక్కలేక దిగమింగటమూ జరిగింది, జరుగుతోందనేది మరో యదార్థం. ఈ విషయంలో రారా నటించలేదు. వాళ్ళ తిట్లను, దాడిని ఎదుర్కోవలసి వస్తుందనే "భయంతో" తన అభిప్రాయాలకు సుగర్ కోటింగ్ వేయలేదు. నిర్మొహమాటంగా కాగితంపై పెట్టాడు. అవి మనకు నచ్చినా నచ్చకున్నా విమర్శకునిగా ప్రదర్శించిన ఆ నిర్భీతికి ఆయన అభినందనీయుడు.

రారా దిగంబర ద్వేషానికి కారణం వారి కవిత్వం, వారిభావాలు, వ్యక్తీకరణ మార్గం మాత్రమే గానీ వ్యక్తులూ, వారి ఉద్యమం కాదనేది స్పష్టం. ఈ విషయంలో చివరి వరకూ ఆయన తన అభిప్రాయాన్ని ఏమాత్రం మార్చుకోలేదు.

రారా దిగంబర కవులనూ, వారి కవితలనూ సరిగా అంచనా వేయలేదని కొందరు విమర్శించారు. అయితే —

28-2-1969న రారా సోమం జయరాంగారికి రాసిన లేఖలో పేర్కొన్న ప్రకారం చూస్తే కె. వి. రమణారెడ్డిగారు అనా డే "దిగంబర కవులను గురించి మీరు చేసిన తీర్పుతో నేనేకీభవిస్తున్నాను" అన్నారు.

వీరిని గురించి క్లుప్తంగానే అయినా చలసాని ప్రసాద్ మరింత సూటిగా ఓ మాట (అరుణతార 100వ సంచికలోని 'విరసం చరిత్ర'లో) అన్నారు. "దిగంబర కవులు ఉద్యమకారులయితే తిరగబడు కవులు మార్గదర్శకులు"— అని.

అలాగే "రారా దిగంబర కవులమీదేసిన అంచనా ఇప్పుడు చాలామంది అంగీకరించారు" అని చేరాగారు రారా చనిపోయిన సందర్భంగా రాసిన "చేరాతలు"లో పేర్కొన్నారు. (చివరి పేజీలు XVI)

ఈ దిగంబర "ఎలర్జీ" కోణం నుండే, దిగంబర కవులు ప్రముఖులుగా ఉన్న విరసంను చూడటంతో రారా విరసంపట్ల అనుమానాలు పెంచుకున్నట్లనిపిస్తుంది.

"మొత్తంమీద తెలుగు సాహిత్యానికి చెడ్డరోజులు వచ్చినాయనే అనుకుంటు

న్నాను. విరసం ఏదైనా సాధిస్తుందనే నమ్మకం నాకు లేదు. పట్టి నినాదాలు ఒకప్పుడు అభ్యుదయ కవిత్వంగా చలామణీ కావటం" మీరూ ఎరుగుదురు. అంత కంటే ఘోరమైన దిగంబర బూతులు విప్లవ కవిత్వంగా శ్రీశ్రీ లాంటి వాళ్ళచేత ఆమోదింపబడటం ఇప్పటికే జరిగింది. ఇకముందు విప్లవ కవిత్వం పేరుతో ఇంకెంత ఘోరాలు జరుగుతాయో తలుచుకుంటే నాకు భయమవుతున్నది.'

"నా మనసులోని ఆందోళన మీ ముందు వెల్లడించినందుకు అన్యథా భావించకండి".

— అని కె. వి. రమణారెడ్డిగారికి 21-8-1970న రాసిన లేఖలో పేర్కొన్నాడు రా రా. విరసం పుట్టి అప్పటికి రెండు నెలలే అయిందనీ, అపుడా సంస్థలో ఈనాడు వివిధ గ్రూపులు, సంస్థలుగా విడిపోయి ఉన్నవారందరూ కలసి ఉన్నారనీ ఈ సందర్భంగా గుర్తుంచుకోవాలి.

అలాగే ఇంతకుముందు సిద్ధాంత నిబద్ధత గల సంస్థగా రారా విరసంను ప్రశంసించిన నాలుగు నెలలకు ముందు ఈ అనుమానాన్ని వెలిబుచ్చాడని కూడా ఇక్కడ గమనించాలి.

దీనినిబట్టి రారా రాగద్వేషాలూ, కోపతాపాలూ ఎలా ఉన్నా ఆయన ఆలోచనా ధోరణిలో నిజాయితీకి లోపం లేదని అర్థం అవుతుంది. వ్యక్తులు కలిస్తేనే సంస్థ. వారి నిజాయితీ మీదనే సంస్థ లక్ష్యాలు ఆచరణలో ఫలించటం ఆధారపడి ఉంటుంది. ఆ నిజాయితీ లోపించిన నాడు ఎంత గొప్ప లక్ష్యాలున్నా సంస్థలు దారి తప్పుతాయి. రారా భయం అదే కావచ్చు.

కె. వి. ఆర్ గారంటే రారాకు బాగా అభిమానం, గౌరవం అని ఈ రారా లేఖల వలననే మనకు అర్థం అవుతుంది. అలాంటి రమణారెడ్డిగారికి రారా మాస్కో నుండి 21-1-1973న రాసిన లేఖలో ఇలా పేర్కొన్నారు (పేజీ 107).

"మీ ఉత్తరమూ, పుస్తకమూ అందినాయి. ఆ పుస్తకంలోని ఒక పేరాగ్రాపు ఇది. "రారా సోవియట్ యూనియన్ మీద ఈగనైనా వాలనివ్వరని నాకు తెలుసు— అసలు రాజకీయాలను గురించి ఉత్తరాలలో రాయుపడ్డన్నారు. అపును, పాపం, సోవియట్ యూనియన్‌లో ఆయన ఒక ఉద్యోగి. ఆయన నౌకరీకి ప్రమాదం వస్తే ఎట్లా ?" (పేజీలు 30-31)

"నన్ను గురించి మీకు ఇంత నీచమైన అభిప్రాయం ఉంటే, నాతో మీరెట్లా ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నారో అర్థంకావటం లేదు".

ఈ విషయంలో రమణారెడ్డి గారు ఇంకా అనేక విషయాల్లో లాగానే చాలా బాధ్యతారహితంగా కామెంట్ చేశారనక తప్పదు. అందుకు ఉదాహరణలు ఈ పుస్తకంలోనే అనేకం ఉన్నాయి. రారా రష్యా వెళ్ళింది అక్కడి గ్రంథ ప్రచురణా సంస్థలో అనువాదకునిగా. అక్కడి నుండి 12-5-1972న రమణారెడ్డిగారికి రాసిందేమంటే "మీరేవో రాజకీయాలు రాసినారు. నేను ఇక్కడి నుండి సాధారణంగా ఎవరికీ రాజకీయాలు రాయడంలేదు. సెన్సార్‌షిప్ ఉండటమేగాక, ఉత్తరాలద్వారా చర్చలు తెగవు కదా. ఇక మీకు రాజకీయాలు రాయాలంటే మరీ సంకోచం"—

దీని అర్థం సుస్పష్టం. రాజకీయంగా వీరిద్దరూ అభిప్రాయాల్లో ఉత్తర-దక్షిణ ధృవాలు. ఇహ చర్చలేమిటి ? అవి తెగేదెపుడు ? అయినా రమణారెడ్డిగారు ఇలా ట్విస్ట్ ఇవ్వటం ఆయన సహజ లక్షణమే కావచ్చుగానీ, రారాకు మాత్రం అన్యాయమే. ఇందుకు ఉదాహరణగా రమణారెడ్డిగారికే మాస్కోనుండి 12.5.1972న రారా రాసిన అదే ఉత్తరంలో (పేజీ 105) "ఇక్కడ రష్యాలో పరమ చండాలమైన బ్యూరోక్రసీ...." అని పేర్కొన్నాడు. ఆ సంగతి గుర్తించగలిగిన, సెన్సార్ ఉందని తెలిసికూడా ఉత్తరంలో రాయగలిగిన రారా నిజాయితీని, ధైర్యాన్ని రమణారెడ్డిగారు గమనించలేక పోవటం యాదృచ్ఛికమా ?.... లేక కావాలని చేసినదా ?

26. 1. 1971 న మాస్కోనుండి సోదుం జయరాంగారికి రాసిన లేఖలో "విశాలాంధ్ర ఆఫీసులో నాకు తెలిసినంతవరకూ లభించనిది ఇంటలెక్చువల్ కంపెనీ అంతా తాలూకాఫీసు గుమాస్తాల బాపతు" అని రాశారు.

అలాగే "నేను ఇక్కడ ఏం చేస్తున్నదీ తెలియదా ? అనువాదం పనితప్ప మరేమీలేదు. ఇదీ ఒక విధమైన గాడిద చాకిరీయే ? మనస్సుకేమీ హాయిలేదు. స్పిరిచువల్ సాటిస్ఫాక్షన్ అసలు లేదు" అనీ రాశారు.

"నా సమయం ఇక్కడ యాంత్రికమైన అనువాదం పనితోనే సరిపోతున్నది" అనీ (పేజి 52), "ఇక్కడకు రమ్మని నేను ఎవరికీ సలహా ఇవ్వను. ఈ జీవితంలో సుఖం ఏమీలేదు. కొంతవరకూ డబ్బు మిగులుతుంది, నిజమే. కానీ, పనిలోకూడా స్పిరిచువల్ సాటిస్ఫాక్షన్ ఏమీ ఉండదు" (పేజీ 58) అనీ రాశారు.

"ఇండియాలో జీవితం దుర్భరంగా ఉందని అందరూ రాస్తున్నారు. ఇక్కడ నాకేమో ఈ జీవితం జైలు జీవితంకంటే దుర్భరంగా ఉంది." అనికూడా (పేజీ 196) కేతు విశ్వనాథరెడ్డిగారికి రాసిన లేఖలో వర్ణించారు.

ఇవన్నీ రష్యాలోని జీవితంమీద, వ్యవస్థమీద విమర్శలు కావా ?

అందుకే రమణారెడ్డిగారు అలవాటుగా చేసే పొరపాట్లలో భాగంగా రారాను నిష్ఠూరాల్తో నొప్పించబోయి, అన్యాయానికి ఒడి గట్టారనటం.

ఈ ఉత్తరాల్లో కొన్నింటిని బట్టి చూస్తే సాహిత్యపరంగా రారా ప్రధానంగా హృదయవాదిగా కనపిస్తాడు. "పాఠకుని బుద్ధికిగాక హృదయానికి అప్పీల్ చేయాలనేదే నేను కాన్‌సిస్టెంట్‌గా కోరేది" అని ఓ లేఖ (పేజీ 41)లో రాశారాయన.

హృదయాన్ని కదిలించగలగటం సాహిత్య "లక్షణం" అయితే, బుద్ధిని ఆలోచింపజేయటం సాహిత్య "ప్రయోజనం" అని ఎందుకు అనుకోగూడదు.

విశ్వనాథ సత్యనారాయణ మాత్రం హృదయాల్ని కదిలించే కథలు రాయలేదా ! అలా కదిలించి, అని సాధించబూనుకున్న ప్రయోజనం ఎలాంటిదో మనకు తెలియదా !

కనుక, ఆ రెండూకూడా సాహిత్యంలో ముఖ్యమైనవే. "సారస్వత వివేచన" లోని తన వ్యాసాలలో రారా ఈ విషయాల్ని మరింత వివరంగా చర్చించారు కూడా.

సాహిత్య సిద్ధాంత చర్చల్లో రారా జగమొండి. ఒక అభిప్రాయానికి వచ్చాక ఇహ తాను పట్టిన కుందేటికి మూడే కాళ్ళనే విషయం రుజూ చేయటానికి తన తర్క పాండిత్యాన్నంతా ధారవోసిన ఉదాహరణలున్నాయి. అద్దేపల్లి రామమోహన రావు గారితో "భీకర" చర్చ శ్రీశ్రీ కవిత్వం విషయంలో జరగటం సాహితీపరులకు గుర్తుండే ఉంటుంది. దానికీ ఈ లేఖలలో ఫుల్‌స్టాప్ కనుపిస్తుంది. కొన్ని పదాల అర్థం విషయంలో అద్దేపల్లి దారి తప్పాడనీ, కావాలనే తప్పించాడనీ రారా ఆరోపించి ఆయన్ని చీల్చి చెండాడాడు. ఆయనకేవేవో దురుద్దేశాల్ని కూడా అంటగట్టబోయాడు.

అయితే - కొంతకాలం తర్వాత శ్రీశ్రీయే స్వయంగా - ఆ పదాల అర్థం విషయంలో అద్దేపల్లి చెప్పిందే సరియయినదని సమర్థించాడు. అప్పుడు మాత్రమే

రారా రిగి వచ్చాడు "అసలు జరిగిందేమిటంటే "ఇతరేతర" శబ్దాన్ని "వేరే వేరే" అన్న అర్థంలో కోస్తా జిల్లాల వాళ్ల వాడుతారట. నేను రాయలసీమ వాణ్ణి గదా! వ్యావహారి ం తెలీకుండా రాయటం నాదే తప్పేమో" (చివరి పేజీల IV) అని ఓ ఇంటర్వ్యూలో 1986లో అంగీకరించారు. పద్దెనిమిదేళ్ళ తర్వాత ఒప్పుకున్నా రన్న మాట!

అలాగే కాళోజి అనువాదం ఖలీల్‌జిబ్రాన్ "జీవనగీత"లోని దోషాలకూ కాళోజీని చీల్చి చెండాడేశారు. కాళోజీని ఎరిగిన వారెందరో ఆ సమీక్ష చదివి, కాళోజీని రారా నిర్దాక్షిణ్యంగా ఉతికి ఆరేసిన "పద్ధతి"కి ఖిన్నులయారు. అయితే అటు కాళోజి చేసిన అనువాద దోషాలనూ, భావ వ్యక్తీకరణా లోపాలనూ సమర్థిం చనూ లేక వారంతా మౌనం వహించాల్సి వచ్చింది.

ఇదంతా దృష్టిలో ఉంచుకుని, అప్పట్లో నేనాయనకో ఉత్తరంలో ఎద్దేవాగా రాశాను. "పేరున్న వారందర్నీ ఉతికి ఆరేస్తూ, వరవరరావు "చలినెగళ్లు" దగ్గరకు వచ్చేసరికి పైపైన తడిమి వదిలేశారేం? ("వర్థమాన కవి వరవరరావు" సంవేదన, అక్టోబర్ - 1968) సోదర సాహిత్య పత్రికా సంపాదకుడనా?" అని.

అందుకు రారా జవాబిస్తూ "సాహిత్యం గురించి సిద్ధాంతాలు చేసి, నిర్వచ నాలు చెప్పి, తోచిన అర్థాలతో దబాయించే సోకాల్డ్ విమర్శకులు, పండితులతో పోలిస్తే - ....మంచో, చెడో తమ మానాన తాము కథలు, కవిత్వం రాసుకుంటూ పోయేవారు గంగిగోవులే గదా" అని రాశారు.

ఆ ఉత్తరం, అలాగే రారా మరికొన్ని ఉత్తరాలు నేను భద్రపరచుకోలేదు. అందువలన ఈ పై మాటల్లో పదాలు మారి తేడా ఏమయినా వచ్చి ఉండవచ్చుగానీ భావం మాత్రం స్పష్టంగా అదే.

దీనిని బట్టి కూడా "క్రూరుడైన విమర్శకుడు"గా శ్రీశ్రీ దీవనలందుకున్న రారా స్వభావం, విమర్శలో ఆయన పాటించిన నియమాలు లేదా కొలబద్దలు కొంత వరకూ అర్థం చేసుకోవచ్చు.

"క్షమించరాని నేరాలను తూర్పారబట్టేటప్పుడు మాత్రమే మా విమర్శలు నిర్దాక్షిణ్యంగా ఉంటున్నాయి. అలాంటి విమర్శలవలన కొన్ని వర్గాలలో మా పత్రికకు అపకీర్తి రావచ్చునని కూడా మేము గుర్తిస్తున్నాము. కాని, ఏ మూల్యం

చెల్లించకుండా ఎవరూ ఏ ఆశయమూ సాధించలేరు 'నీతిప్రౌఢ విహారులైన నిపుణుల్ నిందింపనీ మెచ్చనీ' అనే మనోదార్ఢ్యం ఇలాంటి సందర్భాలలోనే అవసరం. (సంవేదన 1969 ఏప్రిల్) అని ధైర్యంగా చెప్పి, చేశాడు రారా.

ఇది ఇరవయ్యేళ్ళనాటి మాట. మరి ఇన్నేళ్ళ తర్వాత "నిబద్ధులం" అని చెప్పుకుంటున్న మనం ఆ నిర్మోహమాటత్వాన్ని ఎంతవరకూ పాటిస్తున్నాం, సాహిత్య విమర్శలో ఆ "మనోదార్ఢ్యం" ఎంత వరకూ ప్రదర్శిస్తున్నాం? అని ఆత్మ విమర్శ చేసుకోవటం అవసరమే గదా!

---

(రారా లేఖలు, 278 పేజీలు, రు : 50/- ప్రచురణ : రారా స్మారక సమితి, ప్రతులకు : ఆర్. అశోక్‌రెడ్డి, హనుమాన్ నగర్, సూపర్ బజార్ రోడ్, ప్రొద్దుటూరు-516 360)

---

(4 వ పేజీ తరువాయి)

రిజర్వేషన్లకు వ్యతిరేకంగా ముక్కుపచ్చలారని యువతీయువకులు ఆత్మాహుతి చేసుకోగలరు. సాధువులు కాల్పుల నెదిరించి మసీదులు కూల్చగలరు.

ఎవరి 'ఆత్మాహుతి'లో ఎవరి 'మోక్షం' ఇమిడివుందో విడమర్చి వివరించినా గ్రహించి ఊహించలేని ఉన్మాదాన్ని హిందూ మాయావాదానికి, సామ్రాజ్యవాద సరుకుల మాయ తోడై ఉసిగొల్పింది.

అద్వానీ 'రథం' నడిపిన ముస్లిం డ్రైవర్‌కు రామమందిరంలో ప్రవేశముండదు. దళితులకు రిజర్వేషన్లే ఒప్పుకోని సంపన్నవర్గాలు గర్భగుడిలో ప్రవేశాన్ని ఒప్పుకుంటాయా? అయితే ఆ దళితులు వాళ్ళ రథాలు చేయాలి, నడపాలి. ఆ రథాలకు రహదారులు వేయాలి. గుడులు కట్టాలి. గుళ్ళో దేవుళ్ళను పెట్టాలి. ఓట్లు వేయాలి. పార్లమెంటుకు పంపాలి. తుపాకులు పట్టుకొని సహారాలు కాయాలి. యుద్ధాలు చేయాలి. గుడికి బయట, అధికారానికి బయట అస్పృశ్య ప్రేక్షకులుగా మిగిలిపోవాలి.

ఈ సత్యం పీడితులకు కనువిప్పు కలిగించే వెలుగు వ్యాపించినకొద్దీ వర్గ స్వభావం రాజ్య భావంగా మారుతుంది. అవమానత, అణచివేత, హింస - దోపిడీ వర్గాలు తమ చేతిలోని రాజ్యాంగ యంత్రానికి ధారాదత్తం చేస్తాయి. అప్పుడు

రాజ్యం తానే ఒక టెర్రరిస్టుగా మారి తాను విచ్చలవిడి హింసను ఆచరిస్తూ హింస నొక జీవన విధానంగా మారుస్తుంది. అప్పుడు ప్రైవేటు హింస గురించి మాట్లాడడం అర్థరహితం, అమాయకత్వం మాత్రమే కాదు అన్యాయం, ధూర్తత్వం కూడ అవుతుంది. అట్లే మతం ఒక వ్యక్తిక విశ్వాసంగా, సెక్యులరిజం ఒక జీవన విధానంగా వుండే ప్రజలపట్ల రాజ్యం తానే మతతత్వవాదిగా మారి (కమ్యూనలైజ్ అయి) వాళ్ళ అవగాహనను అపమార్గం పట్టించే భావజాలాన్ని పెంచిపోషిస్తుంది. బ్రిటిష్ వలస వాద కాలం నుంచి పరోక్షంగా అమలవుతూ, మతాన్ని రాజకీయాలను ధార్మికనీతి పేరుతో కలగాపులగం చేసిన గాంధీగారి అహింసావాదంలో ప్రచ్ఛన్నమైన హింసగా కొనసాగుతూ, 'సెక్యులరిజం' ముసుగేసుకొని అది ఇందిరా గాంధీ హత్య తర్వాత జరిగిన లోక్‌సభ ఎన్నికల్లో ప్రత్యక్ష నగ్నరూపాన్ని ప్రదర్శించింది. ఇది సెక్యులర్ రాజ్యంకాదు; ఇది హిందూ రాజ్యం - అని ఉన్మాదంతో చెప్పిన వాళ్ళయినా, భయంతో చెప్పిన వాళ్ళయినా చెప్పింది సత్యమే అయింది. అయితే ఇవ్వాళ ప్రజలు హిందూ రాజ్యాన్ని కోరుకుంటున్నారా? మసీదులు కూల్చే మనుషుల్ని చంపే రామ జన్మభూమి కావాలని కోరుకుంటున్నారా? రాముడికి గుడికట్టాలంటున్నారా? సామాన్యునికి కూడు గూడు గుడ్డ కావాలని పోరాడుతున్నారా?

రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళన రూపంలోను, రామజన్మభూమి కోసం రథ యాత్ర రూపంలోనూ దోపిడీవర్గాలనుంచి వచ్చిన సవాల్‌ను అందుకే ఇవ్వాళ మండల్ కమిషన్‌ను అమలుచేస్తానన్న ప్రభుత్వం కన్నా, సాంఘికంగా విద్యావిషయకంగా అణచబడిన వారికి రిజర్వేషన్లు కొనసాగాలని ఆదేశిక సూత్రాలు చెప్పిన రాజ్యాంగం కన్నా, సెక్యులర్ పార్టీలని చెప్పుకుంటున్న కొన్ని పార్లమెంటరీ పార్టీలకన్నా నక్సల్బరీ పంథా ఎదుర్కోవాల్సి వస్తున్నది. రాజ్యాంగం, పార్లమెంటు, పార్లమెంటరీ పార్టీలు, వాటినుంచి ఏర్పడిన ప్రభుత్వం - అన్నీ 'శిలా పాపం' సంస్కృతినుంచి వచ్చినవే కనుక అవి అన్నీ ఆ పాపం తలా పిడికెడు పంచుకోక తప్పదు. అది హిందూ సంస్కృతి అయినా, అది కాంగ్రెస్ సంస్కృతి అయినా అది ఇవ్వాళ భారతీయ జనతాపార్టీ, విశ్వహిందూ పరిషత్, ఆర్.ఎస్.ఎస్, భజరంగ్ దళ్‌వంటి మతోన్మాద రూపాల్లో వ్యక్తమవుతున్నా అర్థవలస అర్థభూస్వామ్య దళారీ నిరంకుశ రాజకీయార్థిక విధానంలో భాగమైన పార్లమెంటరీ పార్టీలన్నీ సారంలో ఈ సంస్కృతిని పెంచి పోషించినవే. అంతేకాదు ఇవి ఈ అసమానత, అణచివేత, హింస అనే

హిందూ సంస్కృతిలోని ప్రాచీన అస్థిగత స్వభావానికి అదే స్వభావంగల సామ్రాజ్య వాద సంస్కృతితో అంటగట్టి రక్తమాంసాలు కూర్చినవే.

అందువల్లనే పార్లమెంటరీ పంథాకు ప్రత్యామ్నాయంగా నక్సల్బరీతో ప్రారంభమయిన నూతన ప్రజాస్వామిక విప్లవం ఇవ్వాళ ప్రామాణికమైన వర్గవిభజనలో అణచబడిన వర్ణాలను, మైనారిటీలను సంలీనం చేసుకోవాల్సివున్నది.

'అందరమూ హిందువులం - ఏక రక్త బంధువులం' అని రామ రథయాత్ర పేరుతో హిందువులను ఏకం చేస్తున్నట్లు నటిస్తున్న మతోన్మాద శక్తులు, సంపన్న వర్గాల రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళనతో అదే హిందూ సమాజంలో సాంఘిక అణచివేతకు గురిఅయిన వారందరినీ వేరుచేస్తున్నవి. వ్యతిరేకిస్తున్నవి. కనుక ఇవ్వాళ ఎనభై అయిదుశాతం ప్రజల్ని కలుపుకొని వచ్చే సామ్రాజ్యవాద వ్యతిరేక, భూస్వామ్య వ్యతిరేక, నూతన ప్రజాతంత్ర విప్లవం- ఒక నిర్దిష్ట అంశంపై ఒక స్పష్టమైన ఆచరణాత్మక వైఖరి తీసుకోవాల్సిన దశలో ప్రవేశించింది. అదే ఎనభై అయిదు శాతం మంది ప్రజలు ఇవ్వాళ సాంఘికంగా అణచబడిన వారుగా, దళితులుగా, మైనారిటీలుగా ఒకవైపు నెట్టబడుతున్నారు. సంపన్నవర్గాలు, మతోన్మాదులు, సామ్రాజ్యవాద, భూస్వామ్య శక్తుల ప్రేరణతో, దళారీల ప్రత్యక్ష సారథ్యంలో మనకు ఎదురుగా మోహరించి ఇప్పటికే ఈ నాలుగు దశాబ్దాల చరిత్ర కనీవినీ ఎరుగని హింసా దౌర్జన్యాలను అమలుచేస్తున్నారు.

వర్గపోరాటం, నూతన ప్రజాస్వామిక విప్లవం సరళరేఖగా సాగేవికాదు అని స్పష్టం చేస్తూ రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళన, 'దున్నేవానికి భూమి' కోరుకునే ప్రజల్ని మతాలుగా చీల్చే రామజన్మభూమి రథయాత్ర (ఇది రథయాత్రగానే ఆగిపోలేదు - ప్రస్తుతానికి పార్లమెంటు గర్భగుడిలో విగ్రహాలను మాత్రం మార్చింది) ఇవ్వాళ విప్లవోద్యమం ఎజెండా మీదికి వచ్చాయి. వీటిని విస్మరించి, ఉపేక్షించి, దాటవేసి కాదు సవాళ్ళుగా స్వీకరించి ముందుకు సాగడం తక్షణ కర్తవ్యం.

నవంబర్ 9, 90. — సంపాదకుడు

# ఆరోపణల వెనుక అంతరంగం ఏమిటి ?

## జీ.డీ.కి సృజన 'సాహితీమిత్రుల' సమాధానం

1966 నవంబర్‌లో ప్రారంభమై, ఎమర్జెన్సీలోను, 1985-89 నిర్బంధకాలంలోను మినహా నిరంతరాయంగా వెలువడుతున్న ఆధునిక సాహిత్యవేదిక 'సృజన' కృషి గురించి చెప్పుకోవాల్సింది ఏంకాదు. 'సృజన'ను నిర్వహించే సాహితీ మిత్రులలో ఒకరయిన జీడిగారు జులై 22 ఉదయం 'వీక్షణం'లో 'ప్రాధాన్యాలకు ఏది ప్రమాణం ?' అనే వ్యాసం రాశారు. అంతకుముందు వీక్షణంలోనే గాంధీగారు 'సాహిత్య విమర్శలో రెండు ఎత్తుగడలు !' అనే వ్యాసం రాశారు. చలం విషయంలో తాను పంపిన ఒక లేఖను సృజన కుంటిసాకులు చూపి తొక్కిపెట్టిందనీ, తద్వారా నిమ్మగడ్డ వెంకటేశ్వరరావును రక్షించడానికి ప్రయత్నించిందనీ గాంధీగారు ఆరోపించారు. గాంధీగారి ఆరోపణలను సమర్థిస్తూ, తనవంతుగా మరిన్ని ఆరోపణలు కలుపుతూ జీడిగారి వ్యాసం సాగింది.

సృజన గాంధీగారి లేఖను ఉద్దేశ్యపూర్వకంగానే అణచిపెట్టిందనీ, అంతంత అనవసరమైన విషయాలకు సంబంధించీ, సాహిత్యానికి చెందని విషయాలకు సంబంధించీ మరెన్నో రచనలు ప్రచురించిందనీ, గాంధీగారి లేఖను ప్రచురించకపోవడం నిమ్మగడ్డ వెంకటేశ్వరరావును రక్షించడానికేననీ, సాహితీ మిత్రులకు ప్రాధాన్యతలకు ప్రమాణాలు సాహిత్యేతరమైనవనీ జీ. డి. ఆరోపించారు. ఈ ప్రమాణాలలో బంధు ప్రీతి కూడ ఉన్నదని ఆరోపించారు. రాజకీయంగా తమకు దగ్గరగా ఉన్నవారికే ప్రాధాన్యత లభిస్తుందనీ, వ్యతిరేకంగా ఉన్నవాళ్ళపై దాడి చేసేందుకు ఎప్పుడూ ఎవరో ఒకరిని సిద్ధంచేసి ఉంచుతారనీ ఆయన ఆరోపించారు. వ్యాపార ప్రకటనల విషయమై సృజనను తప్పుపట్టారు.

'సృజన' మీదగాని, 'సృజన'ను నిర్వహించే 'సాహితీమిత్రుల' మీదగాని, నిర్వహణ తీరు మీదగాని ఎవరికయినా ఏ విమర్శయినా చేసే హక్కు ఉన్నది. ఇరవైనాలుగేళ్ళ ప్రయాణంలో సృజన అనేక విమర్శలను స్వీకరించింది. ఆత్మ విమర్శ చేసుకుంది. ఎప్పటికప్పుడు ఆధునిక సాహిత్యవేదికగా నిలిచి ఉండేందుకు తగిన మార్పులు చేసుకుంటూ వచ్చింది. కనుక ఇప్పుడు గాంధీగారయినా, జీడిగారయినా సృజన మీద ఏ విమర్శయినా చేయవచ్చును గాని ఆ విమర్శలు వాస్తవంతోను, హేతుబద్ధతతోను సంబంధం లేనివయినప్పుడు, కేవలం దురుద్దేశ్యాల మీద

ఆధారపడినవయినప్పుడు, వాస్తవాలను పాఠకులకు వివరించడం తన బాధ్యతగా సృజన భావిస్తోంది. దురుద్దేశ్యంతో ఆరోపణలు చేసేవారికి వాస్తవాల్ని మరుగు పరచడమే అవసరం కావచ్చు. సాహితీమిత్రులకు ఆ అవసరంలేదు. ఇప్పటికైనా ఈ వాస్తవాల్ని వారికోసం కాక పాఠకుల కోసం చెప్పాలనే సాహితీమిత్రులు భావిస్తున్నారు.

మొట్టమొదట, ఈ వివాదానికి ఆధారంగా చూపుతున్న చలం-నిమ్మగడ్డ వివాదం : నిమ్మగడ్డ వెంకటేశ్వరరావుగారిని రక్షించాలనే కోరిక 'సాహితీమిత్రుల' కేమీ లేదు. నిజానికి చలం శ్మశాన సాహిత్యం, స్టేట్ బుక్ క్లబ్ ప్రచురణకు ముందు సృజనకే వచ్చింది. 'సాహితీమిత్రులు' ఆ వ్యాసం ప్రచురణార్హం కాదని తిప్పి పంపారు. అప్పటికి (ఇప్పటికి కూడ) నిమ్మగడ్డ వెంకటేశ్వరరావు గారితో 'సాహితీ మిత్రుల'కు పరిచయం లేకపోయినా, ఆయన సృజనలో రాసిన 'భారతీయ తత్వశాస్త్రం ఒక పరిశీలన' వ్యాసంవల్ల, పుస్తక రూపంలో వెలువడి ఆ వ్యాసం పొందిన ప్రజా దరణవల్ల ఆయనపట్ల గౌరవమే ఉండింది. అయినా చలం సాహిత్యాన్ని శ్మశాన సాహిత్యమని అనడం సరైనది కాదనే ఉద్దేశ్యంతోనే ఆ వ్యాసాన్ని నిరాకరించాము. ఆ వ్యాసాన్నే అచ్చువేయడానికి నిరాకరించినప్పుడు, ఆ వ్యాస రచయితను రక్షించ డమనే సమస్యే తలెత్తదు. నిమ్మగడ్డ తన కొటేషన్లకు సృజనే ఆధారమని అన్నాడు గనుక, ఉస్మానియా విద్యార్థుల జార్జిరెడ్డి సంస్మరణ సంచికలో చలం కొటేషన్ గురించి అబద్ధం చెప్పాడు గనుక ఆ విషయమై గాంధీగారు రాసిన ఉత్తరం సృజనలో ప్రచురించి ఉండవలసిందని ఇప్పుడు అనుకుంటున్నాం కాని ఆ ఉత్తరం ప్రచురించక పోయినంత మాత్రాన 'రెండు ఎత్తుగడల'కు బాధ్యులమయ్యామని మాత్రం అనుకోవ డం లేదు.

ఇక జీడిగారు ఆరోపించిన శ్రీకాకుళరావు వ్యవహారం : సృజన 1974 జూలై సంచికలో 'ఒక రాజకీయ పుస్తకంలో అచ్చు తప్పుల గురించి శ్రీకాకుళరావు రాసిన ఉత్తరాన్ని వేసింద'ని జీడి తప్పు పడుతున్నారు. 'ఒక రాజకీయ పుస్తకం' అనే మాట వెనుక జీడి దాచిన ఆ పుస్తకం 'చారుమజుందార్ రచనలు'. 1973లో 'శ్రామికవర్గ ప్రచురణలు' అచ్చువేసిన ఆ పుస్తకానికి అప్పుడు గొప్ప చారిత్రక ప్రాధాన్యత ఉంది. ప్రజాపోరాట రాజకీయాల వైపు నిలబడిన సృజన ఆ

పుస్తకం ప్రాధాన్యతను గుర్తించింది గనుకనే, ఆ పుస్తకంలో అచ్చుతప్పులవల్ల ఏర్పడగల గందరగోళాన్ని సవరించడం తన బాధ్యతగా భావించింది.

అట్లాగే 1974-78 ల్లో సృజనలో అచ్చయిన శ్రీకాకుళరావు లేఖలన్నీ తవ్వి తీసి, అవి ఎంత 'సాహిత్యేతరమయిన'వో చూసి, ఆయన రచనలు అచ్చువేయడానికి ప్రమాణం వరవరరావుకు బంధువు కావడమేనా అని జీడి ప్రశ్నించారు. అయితే ఇంత జాగ్రత్తగా సంచికలన్నీ వెతికిన జీడిగారు దాచిన వాస్తవమేమంటే ఈ అన్ని సంచికల నిర్వహణతోనూ వరవరరావుకు సంబంధం లేదు. సికిందరాబాదు కుట్ర కేసు ముద్దాయిగా వరవరరావు అరెస్టయి జైల్లో ఉన్నకాలంలో 'సాహితీమిత్రుల' నిర్వహణలో వచ్చిన సృజనలోనే శ్రీకాకుళరావు ఉత్తరాలు అచ్చయ్యాయి. ఆ ఉత్తరాల అచ్చుకు, అసలు ఏ రచన అచ్చుకైనా సృజనకు 'సాహిత్య', 'సాహిత్యేతర' అనే విభజన లేదని జీడిగారికి కూడ తెలుసు. ప్రజాపోరాట గమనానికి, ఉత్తేజానికి, విశ్లేషణకు అవసరమైన సాహిత్య, సామాజికశాస్త్ర, విజ్ఞానశాస్త్ర రచనలన్నిటికీ సృజన వేదిక అయింది స్వయంగా జీడిగారే సాహిత్య రచనలతోపాటు ఎన్నో 'సాహిత్యేతర' రచనలు కూడ చేసి ఉన్నారు. సృజనలో ప్రాధాన్యతలకు ప్రమాణమేమిటో గత 178 సంచికలు, పధ్నాలుగువేల పేజీలు రుజువు చేస్తాయి. పదో సంచిక ముఖచిత్రంమీద 'ట్రిగ్గర్‌మీద వేళ్ళతో రా' అన్నప్పటి నుంచి ఈ ప్రమాణం ప్రజాపోరాట నిబద్ధతవైపే పరిణతి చెందుతూ వచ్చింది.

పౌరహక్కుల సంఘం కార్యదర్శి పత్తిపాటి వెంకటేశ్వర్లు గారి ప్రకటనలో సవరణ సూచిస్తూ శ్రీకాకుళరావు రాసిన లేఖను కూడ తప్పుపట్టారు జీ.డి. ఈ విషయంలో జీ.డి. దాచిపెట్టిన వాస్తవాలు, వక్రీకరించిన అంశాలు మూడున్నాయి. ఒకటి- శ్రీకాకుళరావు ఉత్తరంలో పౌరహక్కుల సంఘం కర్తవ్యంగా చెప్పినవి శ్రీకాకుళరావు రాసినవి కావు. అక్కడ శ్రీకాకుళరావు 1973 డిసెంబరు సృజనలో పౌరహక్కుల సంఘం మొదటి మహాసభ సందర్భంగా రాసిన సంపాదకీయాన్ని కోట్ చేస్తున్నాడు రెండు శ్రీకాకుళరావు ఉత్తరం కిందనే పత్తిపాటి వెంకటేశ్వర్లుగారి వివరణలో శ్రీకాకుళరావు కోట్ చేసిన ఈ విషయానికి మౌన అంగీకారం ఉన్నది. మూడు : జగిత్యాల ప్రజాపోరాటంతో ప్రారంభమైన ప్రజాపంథా కంటె ముందు సృజనకు పౌరహక్కుల సంఘం విషయంలో ఉండిన దృక్పథాన్ని జీ.డి. ఇవాళ్టి అనుభవంతో ఎద్దేవా చేస్తున్నారు. గతంలోని మన అసమగ్ర అవగాహన ఇవాళ

విమర్శకు పాత్రం కావచ్చుగాని, దానిపైన ఎద్దేవా చేయడం ఎటువంటి సంస్కారమో జీ.డి. కే తెలియాలి (ఈ విషయంలో 'సృజన' మారిన తన అభిప్రాయాన్ని జీ.డి. ఉత్తరం కన్న ముందే సవరించుకున్నది. చూ. సృజన సంపాదకీయాలు, పేజీ 47).

సృజనలో వ్యాపార ప్రకటనలు ఎమర్జెన్సీకి ముందు నిర్విచక్షణగా వచ్చినమాట నిజమే. కాని 1978 తర్వాత 1980 ఫిబ్రవరి-మే (100వ సంచిక) వరకు ప్రకటలను నిర్విచక్షణగా ప్రచురించలేదు. కేవలం 100 వ సంచికలో మాత్రం మూడు వందల పేజీలకు పైబడిన ఆ సంచికను ఐదు రూపాయలకే అందించడం కోసం కొన్ని ప్రకటనలు అంగీకరించవలసి వచ్చింది. ఆ తర్వాత సృజన మళ్ళీ ఎప్పుడూ ప్రకటనలు వేయలేదు. ఈ వాస్తవాలను వక్రీకరించి, 1972 ప్రకటన ఒకదాన్ని, 1970 ప్రకటన ఒకదాన్నీ కలిపి సృజనను అవహేళన చేయడానికి ప్రయత్నించడం వెనుక ఉన్నది కచ్చితంగా దురుద్దేశ్యమే.

రంగనాయకమ్మగారు 'జల్లెడకు ఎన్ని చిల్లులో అన్ని చిల్లులు' అనే పుస్తకం ముందుమాటలో చేసిన ఆరోపణనే జీ.డి. గారు ఈ వ్యాసంలో మళ్ళీ చేశారు. రంగనాయకమ్మ, గాంధీ అనువాదం చేసిన 'చైనాలో ఏం జరుగుతోంది?' అనే పుస్తకాన్ని 1984 అక్టోబరు సృజనలో బాలగోపాల్ సమీక్షించారు. ఆ సమీక్షపై చర్చ ప్రారంభమయింది. చర్చలో పాల్గొంటూ రంగనాయకమ్మగారు ఒక వ్యాసం పంపారు. ఆ వ్యాసం బాలగోపాల్ గదిలో ఉండగా పోలీసులు దాడిచేసి ఆయన గదిలో పూచిక పుల్ల కూడ మిగల్చకుండా ఎత్తుకుపోయారు. ఆ దాడిలో వ్యాసం పోయిందని వెంటనే వరవరరావు రాశారు. అప్పుడేమీ అనని రంగనాయకమ్మగారు నాలుగు సంవత్సరాల తర్వాత వ్యాసం పోయిందనడం అబద్ధమని అనుమానిస్తున్నారు. జీ.డి. కూడ దాదాపు రెండేళ్ళ తర్వాత ఆ అనుమానాన్ని సమర్థిస్తున్నారు. దురుద్దేశ్యానికీ, ఉద్దేశ్యపూర్వకంగా బురద జల్లడానికీ ఇంతకన్న పెద్ద నిదర్శనం అవసరం లేదు.

గాంధీగారి లేఖ విషయం తనకు తెలిస్తే ఎజెండా మీదికి తెచ్చేవాడినని అంటున్న జీ.డి.గారు తాను 'సాహితీ మిత్రుల'లో చురుకుగా పనిచేసిన కాలంలో అంతకు ముందరి, 1971 కీ, 1974 కూ సంబంధించిన విషయాలు తెలిసి ఉన్నా ఎందుకు చర్చించలేదో, అవి చర్చించడానికి ఉదయం వీక్షణమే ఎందుకు వేదిక అయిందో, ఆ చర్చకు 1990 మార్చ్ తదనంతర కాలమే ఎందుకు కలిసి వచ్చిందో

అర్థం చేసుకోవాలంటే పైన చెప్పిన వాస్తవాలు, ఆ వాస్తవాల్ని వక్రీకరించదలచిన దురుద్దేశ్యాలు అర్థం కావాలి.

కడుపులో అన్ని దురుద్దేశ్యాలు పెట్టుకొని, జనవరి 90లో 'సాహితీమిత్రులు'లో క్రియాశీలంగా పాల్గొని, మార్చి 7న స్వచ్ఛందంగా గోర్కీ వ్యాసం అనువాద బాధ్యత తీసుకుని (చేయకుండా), మే నెలలో గానీ తనకు 'సాహితీమిత్రుల'కు రావాలనిపించడంలేదని కబురు పెట్టిన జీ.డి. కి 'సాహితీమిత్రులు'లో వ్యక్తులపట్ల ఏవో వ్యక్తిగత షికాయతులున్నాయి. (ఎందుకంటే ఇప్పటికీ ఆయనకు సృజన పట్ల అపారమైన గౌరవముందంటున్నారు). వాటికి జనవరి నుంచి సాహిత్య సాంస్కృతిక రంగాల్లో చెలరేగుతున్న దురుద్దేశ్యపూర్వకమైన రాజకీయవాదులు శక్తినిచ్చాయి. ఏ సంబంధమూ, ప్రమేయమూ ఉండనక్కర్లేని 'ఉదయం'లో గాంధీగారు 'ఎత్తుగడల' వివాదం రేకెత్తించడం మొదలు జీ.డి.గారి ముక్తాయింపు వరకు ఈ నేపథ్యంలోనే అవగాహన చేసుకోవాల్సి వుంటుందని పాఠకులకు విజ్ఞప్తి చేస్తున్నాం.

—'సాహితీమిత్రులు'

[తనకు ఏమాత్రం సంబంధంలేని ఒక వివాదాన్ని 'సాహిత్య విమర్శలో రెండు ఎత్తుగడలు'గా భావించి ఏడు సంవత్సరాల తర్వాత వేదిక కల్పించిన 'ఉదయం' చర్చ ఆగిపోయినట్లనిపించిన కొంత వ్యవధి తర్వాత జీ.డి. వ్యాసం వేసి 'ఇంతటితో ఈ చర్చ ముగిస్తున్నామ'ని ఏకపక్ష నిర్ణయం తీసుకున్నది. చర్చలో పాల్గొన్న సముద్రాల రాఘవులు వంటి వారి విషయంలో ఊహాజనితమైన ఐడెంటిటీతో ఈ చర్చలో ఏ సంబంధంలేని వారిపై వ్యక్తిగత నిందలు రాసినా అచ్చేసిందే కాని అపోహలు తొలగించలేదు. 'సాహితీమిత్రులు' రాసే జవాబు వ్యక్తులుగా రాసేది కాజాలదు కాబట్టి ఆలస్యమైనా వేస్తారనే ఆశతో సెప్టెంబర్ ఆఖరువారంలో పంపితే 'వీక్షణం' ఆగిపోయిందని-ఆగిపోయింది 'ఉదయం' కాదు—తిప్పి పంపారు. కనుక 'ఏ సంబంధమూ ప్రమేయమూ ఉండనక్కర్లే'దని మేం 'ఉదయం' నిష్పాక్షికత మీద భరోసా పెట్టుకోవడం అర్భకత్వమే అయింది. అందుకని ఇంక సృజనలో వేయక తప్పని ఈ జవాబు 'ఉదయం' పాఠకులందరికీ అందదనే కొరత మాకు ఉండనే వుంటుంది—సా. మి.]

## బాబ్రీమసీదు-రామజన్మభూమి

'బాబ్రీమసీదు—రామజన్మభూమి' అనే వ్యాసంలో వేణు చేసిన విశ్లేషణ చాలా నిజం. అయితే సమస్య పరిష్కారానికి తీసుకోవలసిన చర్యల గురించి గానీ, ఈ సమస్య పట్ల ప్రజాస్వామికవాదులు అవలంబించవలసిన వైఖరి గురించి గానీ ఏమీ వివరించకపోవడం ప్రధాన లోపం.

మతతత్వాన్ని సమగ్రంగా అర్థంచేసుకోకుండా కొందరు ప్రగతిశీల మేధావులు అసాధ్యమైన, అన్యాయమైన పరిష్కారాలు సూచించారంటూ విమర్శించిన వేణు న్యాయమైన, సాధ్యమయిన పరిష్కారాన్ని ఎందుకు సూచించలేదో అర్థం కాలేదు.

ఆయన సూచించినట్లు మతం గురించి, మతతత్వం గురించి, సెక్యులరిజం గురించి వివరమయిన చర్చ తప్పనిసరిగా జరగాల్సిందే. కానీ సమగ్రమయిన చర్చ జరిగేవరకూ తక్షణ పరిష్కారం దొరకదనడం సరయింది కాదు. బాబ్రీ మసీదుని కూల్చి రామమందిరం నిర్మించి హిందూ ఓట్లని పొంది రాజ్యాధికారాన్ని సంపాదించడం కోసం మత కల్లోలాన్ని రెచ్చగొట్టడానికి బి జె పి. తీవ్రమయిన ప్రయత్నాలు చేస్తున్నప్పుడు దాన్ని అడ్డుకోవడానికి ఏదో ఒక పరిష్కారమార్గాన్ని ప్రజాస్వామికవాదులు ప్రతిపాదించాలి. అలా కాకుండా ప్రస్తుతానికి తక్షణ పరిష్కారం లేదా తాత్కాలిక పరిష్కారం ఏమీ లేదనడం అంటే దానివలన లాభపడేది ఎవరు? బూర్జువా పాలకవర్గాలే కదా ?

ఒక చర్చాక్రమం ప్రారంభమై, ఆ చర్చ సవ్యంగా నడిచి సరయిన, సమగ్రమయిన పరిష్కారం దొరికే వరకూ పాలక వర్గాలు చేతులు ముడుచుకుని కూర్చుంటే ఎవరికీ బాధలేదు. కానీ ఈ లోపలే మతయుద్ధం బద్ధలయ్యే పరిస్థితిని పాలకవర్గాలు కల్పిస్తున్నాయి. అందువలన సమస్యకి తక్షణ పరిష్కారాన్ని, కార్మికవర్గ ప్రయోజనాలకి దగ్గరగా ఉన్నదాన్ని తప్పనిసరిగా ప్రతిపాదించాలి. ముఖ్యంగా మార్క్సిస్టు దృక్పథంలో ఈ సమస్యని విశ్లేషించేవారు ప్రస్తుతానికి ఏ పరిష్కారాన్నీ సూచించకుండా వదిలి వేయడమంటే దేశంలో పెరుగుతున్న మతోన్మాదాన్ని నిర్లిప్తంగా చూస్తూ ఊరుకోవడమన్నమాట.

సమస్య గురించి ప్రస్తుతం జరుగుతున్న చర్చ భవిష్యత్తులో సంపూర్ణ పరిష్కారాన్ని సంపాదించడం కోసమే పరిమితం కాకుండా, ప్రస్తుతానికి తక్షణ లేదా తాత్కాలిక పరిష్కారాన్ని సంపాదించడానికి కూడా జరగాలి.

జి. మోహన్

ఏలూరు

SRJANA Telugu Monthly October/November 1990
Regd. No with the Registrar of Newspapers for India 10953/67

# సృజనకు ఆర్థిక, హార్దిక సహకారాన్ని అందించండి!

1990 జనవరిలో మళ్ళీ ప్రారంభమైన 'సృజన' ఈ పదకొండు నెలలుగా తీవ్రమైన ఆర్థిక సమస్యలను, రచనల కొరతను ఎదుర్కొంటున్నది. సృజన పట్ల పాఠకులలో, విప్లవోద్యమ సానుభూతిపరులలో కనబడుతున్న విస్తృత ఆదరణ ఆర్థిక రూపంలోకి పరిణమించడం లేదు. సృజన చందాదారుల సంఖ్య, ఏజెంట్ల సంఖ్య గణనీయంగా పెరగడం లేదు. సృజన మీ పత్రిక. సృజన ప్రజల పత్రిక. సృజనను గతంలో కూడ ప్రజలే తమ కంటికి రెప్పలా కాపాడుకున్నారు. మళ్ళీ ఒకసారి హెచ్చు సంఖ్యలో చందాలు చేర్పించడం ద్వారా, విరాళాలు సేకరించడం ద్వారా, కొత్త ప్రాంతాలలో ఏజెంట్లను కుదిర్చిపెట్టడం ద్వారా, ఏజెంట్లు సక్రమంగా బకాయిలు చెల్లిస్తున్నారో లేదో కనుక్కోవడం ద్వారా ప్రజలే సృజన జీవనానికి బాసటగా నిలవవలసి ఉన్నది. సృజనను రక్షించుకునే బాధ్యతను విప్లవ సాహిత్యోద్యమ సానుభూతిపరులు స్వచ్ఛందంగా స్వీకరించవలసి ఉన్నది.

సృజన సంవత్సర చందా రు. 40. విడి ప్రతి రు. 4.

* సృజనకు విరివిగా చందాలు సేకరించండి!
* సృజనను పదికాలాల పాటు నిలిపి ఉంచేందుకు మీ వంతు కర్తవ్యం నిర్వహించండి!

SRJANA Rs. 4/-
Flat 11, Block 2,
MIG II, Baghlingampalli,
Hyderabad-500 044.